# దర్శనకర్తలు - దర్శనములు

సర్వదర్శన సంగ్రహము

3వ భాగము

(సాంఖ్య పాతంజల శాంకరములు)

సాయణ మాధవ శంకరాదులు

నేటి ఆధ్యాత్మిక సంస్థల సంప్రదాయములును.




చర్ల గణపతిశాస్త్రి

వెల : 10-00

# భూమిక

సూర్యునినుండి కాంతికిరణములు బయలుదేరినట్లు పరమాత్మనుండి జీవాత్మలు వెడలి తిరుగ సూర్యునిలోవలె పరమాత్మలోఁగలిసియేకము కావలయును. లేక త్రాడును పాము అనుకొనినట్లు, ముత్యపుచిప్పను వెండిఅనుకొని భ్రాంతిచేత అయాభయాదులను పొంది నిజముతెలిసికొనగా అభయాదులను పోగొట్టుకొనునట్లు ఈ ఆత్మను ప్రపంచముగా అనుకొని వివేకముచే ప్రపంచమును ఆత్మగా గుర్తించి తనస్వరూపము తెలిసికొనునట్లు జీవి తన నిజస్వరూపము తెలిసికొని తనసచ్చిదానందరూపమును పొందవలెను. అసలు నిజరూపమును ఇంకొకరూపముగా అనుకొనుటను అధ్యాస అని వేదాంతులు అందురు. అట్టిఅధ్యాసను తెలిసికొని తననిజరూపమును గ్రహించవలెను. ఈ పై సంగతులు అనేకులు జ్ఞానులు భక్తులు ఉపాసకులు తమతమ వివేకశక్తిని బట్టి వేరువేరుగా తలచిముక్తులైరి. ఇట్టి భిన్న భిన్నదర్శనములనే దర్శనము లందురు. ఈ 1, 2, 3, భాగములలో చార్వాక జైనాదులు మొదలు శాంకర-దర్శనము వరకు చూపబడినవి. వీనికి ద్వైత విశిష్టాద్వైతాద్వైత భావములె మూలసిద్ధాంతములు. ఈ సిద్ధాంతములను బట్టియె పూర్వాధునాతన ఋషి సాధు భక్తశ్రేష్ఠులు తెలిసికొని తెలిపినారు. అవి ఈ సర్వదర్శనసంగ్రహము లోను అనుబంధములోను చూపబడినవి. అధునాతన భావములను దేశకాలాదులను బట్టి నడచిచూపిన మహానుభావుల భావము లిక్కడ ఇందు సూచన ప్రాయముగా తెలుపబడినవి.

ఇందలి అనుబంధములో నేడుప్రచారములోనున్న నింబార్క, చైతన్య వల్లభుల భావములు, కబీరు భావములు రాధాస్వామి సౌరబ్రహ్మసమాజార్య సమాజాది సంప్రదాయములు శ్రీ రామకృష్ణ పరమహంసాది భక్తుల జీవిత సారములు అతి సంగ్రహముగ చూపబడినవి.

వీనిని పాఠకులు తెలిసికొని కర్తవ్యపరాయణులై ధన్యులవుదురుగాక.

ఇట్లు
బుధవిధేయుడు
చర్ల గణపతిశాస్త్రి

# విషయసూచిక

## కపిలుడు

ఈతని కాలాదులను గూర్చి సరియైన ఆధారములు దొరుకుట లేదు కపిలుని పేరు పురాణములలోను భగవద్గీత మొదలగువానిలోను గనిపించుటచే వానికంటె పూర్వుడందురు. క్రీ.స్తు'5 00 ఏండ్లకు పూర్వమున నుండియుండును. ఈశ్వర కృష్ణుని సాంఖ్యకారికలకు ప్రసిద్ధియుండుటచే సాంఖ్య కారికలనుజూచి యెవరో కపిలుని పేరు పెట్టి ఈ దర్శనమును వ్రాసియుండ వచ్చునని కొందరు చెప్పుదురు. కాని ఈ దర్శనము కపిలుని చేతనే వ్రాయబడినట్లు విజ్ఞాన భిక్షువు వ్రాసిన వ్యాఖ్యనుబట్టి తెలియుచున్నది.

కాశీపదభట్టాచార్యులు కపిలుడు క్రీ. స్తు.పూ. 700లకు పూర్వపువాడని నిశ్చయించెను.

కపిలమహర్షి సరస్వతీ నదీతీరమున కర్దమ ప్రజాపతి యాశ్రమమున నున్నట్లు తెలియుచున్నది. ఇది ఉత్తరభారతదేశమున నేటి అంబాల జిల్లాకు ఉత్తరముగ ఈశాన్యమున నున్నదని కొందఱన్నారు. ఇతడు షష్టితంత్రము సాంఖ్యదర్శనమును రచించెను. ఇతనికి అసురి శిష్యుడు. ఈ యాసురి పంచముఖునికి చెప్పెను. దీనినిబట్టియె ఈశ్వర కృష్ణుడు సాంఖ్యకారికలను వ్రాసియుండవచ్చును.

## సాంఖ్యదర్శనము

మఱి సాంఖ్యులు చెప్పిన 1. రీతిగా పరిణామవాదము శత్రువయి (పరి పంథియయి) యుండగా ఏమని వివర్తవాదము. 2 ఆదరణీయమగును. ఇది వారి యాఘోషము, సంక్షేపముగా సాంఖ్య శాస్త్రమందు నాలుగు పద్ధతులు సంభావింపబడుచున్నవి. 1 ప్రకృతి 2 వికృతి 3 ప్రకృతి వికృతము 4 అనుభయము. రెండుగానిది అని.

అందు కేవల ప్రకృతి ప్రధాన పదములచేత దెలియదగిన మూల ప్రకృతి. ఇది యింకొక దానికి దేనికిని వికృతి కాదు. ప్రకరోతి ఇది ఎక్కు

ఉన్న ద్రవ్యము ఇంకొక రూపము పొందుట పరిణామము 2తన పూర్వ రూపము విడక అసద్రూపముగా ప్రతీతమగుట వివర్తము బ్రహ్మము ప్రస్తుత ప్రపంచముగా తోచుట]

పగా చేయుచున్నది గాన ప్రకృతి అని వ్యుత్పత్తిచేత సత్త్వరజస్తమో గుణముల సామ్యావస్థ అని చెప్పబడినది. అది యిట్లు చెప్పబడినది.

సూ. "మూల ప్రకృతి రవికృతిః

మూల ప్రకృతి వికృతి లేనిది (సాం, కా, 3)

మూలమైన ప్రకృతి మూలప్రకృతి, మహదాది కార్యకలాపముల కిది మూలము, ఈ ప్రధానమునకు ఇంకొక మూలము లేదు. అట్లన్నచో అనవస్థ అను దోషము ఇక్కడ ఏర్పడును. ప్రమాణము లేకపోవుటవలన బీజాంకుర న్యాయమువలె అనవస్థా దోషము కలుగదనరాదు, ప్రధానమునకిది కారణము అనుదానిలో ఏదియు ప్రమాణముకాదని అప్రామాణికమైన కార్య కారణ భావము యొక్క కల్పనచే గలిగిన అనవస్థ దోషమునకే అగు నని భావము. వికృతులైన ప్రకృతులు మహదహంకార తన్మాత్రలు. అదియును చెప్పబడెను. ''మహదాద్యా: ప్రకృతి వికృతయ: సప్తేతి [సాం కా, 3,]

ప్రకృతులైనవియును వికృతులును అయినవి ప్రకృతి వికృతులు. అవి ఏడు మహదాది తత్త్వములు. అందు అంత: కరణాది పదములచే చెప్పబడు సుహత్తత్త్వములు, అహంకారమునకు ప్రకృతి మూలప్రకృతి వల్లనైతే వికృతి కలుగుచున్నది, ఇట్లుఅభిమానము అను మారుపేరుగల అహంకారతత్త్వము మహత్తునకు వికృతి. తామసమైన ఆ అహంకారతత్త్వమే సూక్ష్మమైన సత్పంచ తన్మాత్రములకు ప్రకృతి. ఏకాదశేంద్రియములైన చక్షుః శ్రోత్ర ఘ్రాణ రసనా త్వక్కులనెడి జ్ఞానేంద్రియములకు కర్మేంద్రియములైన వాక్కు పాణి పాదపాయూపస్థము అనువానికి ఉభయాత్మకమైన మనస్సుకును సత్త్వప్రకృతి ఉభయత్ర క్రియోత్పాదన ద్వారా కారణమగుచున్నది కాన రజస్సు వ్యర్థము గాదు అది ఈశ్వర కృష్ణునిచే నిట్లుచెప్పబడినది—

"అభిమానోఽహంకారస్తస్మాద్ద్వివిధః ప్రవర్తతే సర్గః
ఏకాదశ కరణ గణస్తన్మాత్రా ప్రపంచకం చైవ
సాత్త్వికం ఏకాదశః ప్రవర్తతే వైకృతా దహంకారాత్
భూతాదేస్తన్మాత్రః సతామసస్తైజసాదుభయం
బుద్ధీంద్రియాణి చక్షుః శ్రోత్రఘ్రాణ రసన త్వగాఖ్యాని
వాక్పాదపాణి పాయూపస్థాని కర్మేంద్రియాణ్యాహుః
ఉభయాత్మక మత్ర సంకల్ప మింద్రియం చసా ధర్మాదితి
[సాం కా 24 28]

తత్త్వకౌముది యందు ఆచార్య వాచస్పతి మిశ్రులచే వివరింపబడినది కూడ—

కేవల వికృతియైతే ఆకాశాది పంచ మహా భూతములు ఏకాదశేంద్రియములును. అది ఇట్లు చెప్పబడినది. షోడశకస్తు వికారః (సాం.కా.3.) అని. షోడశసంఖ్య గల గణము. షోడశక వికారమే గాని ప్రకృతి గాదని యర్థము. ఆలోచింపఁగా ఆవు కుండ మొదలగు వానికి పృథి వ్యాదులు ప్రకృతే. అయినను అవి పృథివ్యాదులకంటె వేఱైన తత్త్వములు గావు గాన ప్రకృతిగాదు. ఇతర తత్త్వము ఉపాదాన కారణముగా నున్నదే ఇక్కడ ప్రకృతి యనగా. గోఘటాదులకు స్థూలేంద్రియ గ్రాహ్యత్వములు సమానమగుటచేత తత్త్వాంతరములుగావు. అందు శబ్ద స్పర్శరూపరస గంధాదులైన పూర్వపూర్వ సూక్ష్మభూత సహితములైన తన్మాత్రల కంటె పంచ మహాభూతములగు ఆకాశాదులు క్రమముగా ఒకటి రెండు మూఁడు నాలుగు అయిదు గుణములు గలవై పుట్టుచున్నవి. ఇంద్రియ సృష్టియయితే ఇది వఱకే చెప్పఁబడును. అది యిట్లు చెప్పఁబడెను.

ప్రకృతి నుండి మహత్తు మహత్తు నుండి అహంకారము అహంకారమును పంచ తన్మాత్రలు పదునొకండు ఇంద్రియములు గల గణము. దాని నుండి పంచ భూతములు గలుగుచున్నవి.

> "ప్రకృతే ర్మహాంస్తతోఽహంకార స్తస్మాద్గణశ్చ
> షోడశకః తస్మాదపి షోడశకాత్ పంచభ్యః
> పంచభూతాని (సాం.కా.3.).

పురుషుఁడైతే కూటస్థ నిత్యుఁడు అపరిణామి. అతఁడు దేనికినీ ప్రకృతి యుఁగాఁడు వికృతియును గాఁడు అని యర్థము.

ఏకాదశ తత్త్వములను సాధించునవి గాన ప్రత్యక్షానుమాన శబ్దము లను మూడు ప్రమాణములు చెప్పబడెను. అదియును చెప్పఁబడెను,

"దృష్ట మనుమానుమా ప్త వచనంచ సర్వప్రమాణసిద్ధత్వాత్। త్రివిధం ప్రమాణమిష్టం ప్రమేయసిద్ధిః ప్రమాణాద్ధి. (సాం.కా.4,)·

ఇందు కార్య కారణ భావములో విప్రతిపత్తి నాలుగు విధములుగా ప్రసరించు చున్నది. అసత్తునుండి సత్తు పుట్టుచున్నదని బౌద్ధులు చెప్పుచున్నారు. సత్తు నుండి అసత్తు పుట్టుచున్నదని నైయాయిక వైశేషిక వేదాంతులు. కార్యజాత మంతయు సత్తుయొక్క వివర్తమె కాని సద్వస్తువుగాదు అని సాంఖ్యులైతే సత్తునుండి సత్తు పుట్టునందురు.

అందు అసత్తు నుండి సత్తు పుట్టునను ప్రామాణిక పక్షముగాదు. నిరుపాఖ్యమైనది శశ విషాణము వంటిది కాన అసత్తు కారణ మగుట ఉపపన్నము గాదు. అభావ రూపమును నిస్స్వరూపమునగు తుచ్ఛమునకు ఉత్తర క్షణిక మందలి ఘటమునకు ఉపాదాన కారణమగు తాదాత్మ్యము అనుపపన్నము గావున

పోని సత్తు నుండి అసత్తు పుట్టదు. కారక వ్యాపార రూపమైన యసత్తునకు పూర్వము శశవిషాణమువలె సంబంధ లక్షణోత్పత్తి అనుపపన్నమగున్నది గనుక. ఎంత నేర్పుగలవాండైనను నీలమును పీతముగాం జేయంజాలండు. పోనీ సత్త్వాసత్తములు ఘట ధర్మములు అన్నచో అది సుందరముగాదు. అసత్తయిన ధర్మియందు తద్ధర్మము కలుగు ననుట యుపపన్నముగాదు గాన ధర్మి సత్త్వము గావలసి వచ్చును.

కాన కారక వ్యాపారముకంటెం బూర్వమునం గూడ కార్యము సత్తే. సత్తునకు అభివ్యక్తి ఉపపన్నమగును. ఎట్లు పీడనముచేత తిలలందు తైలము పిదుకుటచేత ఆవులందు పాలును గలుగు చున్నవో అట్లు అసత్తునకు కారణమగుటలో నిదర్శన మేమియు కనిపింపదు. మఱియును కార్యముతో కారణము సంబంధమై యున్నదా లేక అసంబంధమా. మొదటి పక్షములో కార్యము సత్త్వము కావలసి వచ్చును. సత్తులకే సంబంధము కలుగిదని నియమము గదా. చివరి పక్షములో కార్యజాతమంతయు అంతనుండి పుటవలసి యుండును. అది యంతయు అసంబద్ధ మగుటలో తేడాలేదు గదా. అది సాంఖ్యాచార్యులచే నిట్లు చెప్పంబడెను.

"అసత్త్వాన్నాస్తి సంబంధః కారణైః సత్త్వసంగిభిః
అసంబద్ధస్య చోత్పత్తి మిచ్ఛతో నవ్యవస్థితిః"

'లేకపోవుట వలన- సత్త్వసంగము గల కారణములతో సంబంధమును వాని యుత్పత్తిని కోరుదానికి వ్యవస్థలేదు." అని.

మఱి అసంబద్ధమైనను ఎక్కడ ఏశక్తి కలదో అక్కడ అది దానినే పుట్టించును అని యిట్లు అన్నచో — శక్తి కూడ కార్య దర్శనముచే ఊహింపఁ దగినది అనియు అన్నచో అది కుదురదు. తిలలందు తైలమును పుట్టించు శక్తి యున్నదనునపుడు తైలము లేనపుడు సంబద్ధత్వా సంబద్ధత్వ వికల్పనములచే ఆశక్తి యున్నదని నిరూపించుట కుదురదు గదా. కార్య కారణములు అభిన్నములు గాన కారణము కంటె వేఱుగా కార్యము ఉండదు గదా. వస్త్రము దారములకంటె భేదించుటలేదే. అది దాని ధర్మము గదా. ఏది అట్లుగాదో అది యిట్లుకాదు. ఎట్లు అనఁగా గోవు గుఱ్ఱము వస్త్రము తంతు ధర్మము గలది గదా. కనుక తంతువులు వస్త్రము కంటె వేఱుకావు. మఱి అట్లయినచో ఆ తంతువులె శరీరమును కప్పెడి కార్యమును చేయవలయును గదా. అన్నచో అట్లనరాదు. ఆకార భేదముచేత వస్త్రముగా తయారయిన తంతువులు కప్పెడి క్రియను చేయుట ఉపపన్నమగుచున్నది గదా. ఎట్లనఁగా తాబేలులోని యంగములు తాఁబేలు శరీరము ముడిచి కొనుటచే కనిపింపవు వెలికివచ్చును గూడ. ఆవిర్భవించుచున్నవి గూడ. ఇట్లు కారణమైన తంతువులు మొదలగువానివల్ల వస్త్రాదివిశేషములు బయలు వెడలుచు నావిర్భవించుచు ఉత్పన్నము అగుచున్నవని చెప్పఁబడుచున్నవి. తాబేలు అంగములు ముడుచుకొనఁబడుచు మాయమగుచు నశించుచున్నవి. అంతే గాని లేనివానికి ఉత్పత్తియును, ఉన్నవానికి నాశమును గలుగుటలేదు. ఇది గీతలో ఇట్లు చెప్పఁబడినది.

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః (గీ. 1.1.6)
లేనిది యుండదెప్పుడు, నున్నది పోవదెప్పుడున్. (తెనుగు గీత.)

కనుక కార్యానుమానమును బట్టి ఆ ప్రధానము సిద్ధించుచున్నది. అది యిట్లు చెప్పఁబడినది—

అసద కరణాదుపాదన గ్రహణాత్ సర్వసంభవా భావాత్
శక్తస్య శక్య కరణాత్ కారణభావాచ్చ సత్కార్యం (సాంకా 8.)

(సత్తేచేయునుగాని) అసత్తు చేయుకపోవుటవల్ల, ఉపాదానముల యొక్క (కారణములయొక్క కారణములు కార్యముతో కలిసియె కార్యమును జేయును. గ్రహణమువల్ల (కార్యములతో సంబంధమువల్ల) తంతువుల నుండె వస్త్రము గలుగును. మఱొకదాని నుండి కావు. మట్టినుండే కుండలు. లోహము నుండికావు కనుక సర్వోత్పత్తియు (సర్వమునుండి) సంభవింపకపోవుటవల్ల. శక్తికలది దానికి శక్యమైన దానినే చేయుట వల్ల కారణ భావము వల్లను సత్తు కార్యమె. సత్తు అయిన బ్రహ్మతత్త్వమునకు ప్రపంచము వివర్తము కూడఁగాదు. ఏలయన ఇది రజతము కాదనునట్లు ఇది ప్రపంచముకాదు అని బాధ కనిపించుటలేదు కనుక. అధిష్ఠానమైన చైతన్యమును ఆరోపింపఁబడిన జడమును రజత శక్తులకు వలె సారూప్యము లేకపోవుట వలన ఆరోపించుట అసంభవమగుట వలనను వివర్తము అనుట సరికాదు.

కనుక సుఖ దుఃఖ మోహరూపమైన ప్రపంచమునకు అవిధమైన సుఖదుఃఖాది రూప కారణము నిశ్చయింపఁ దగినది. అట్లును ప్రయోగము కలదు. సుఖ దుఃఖ మోహములతోఁ గూడిన దగుటవల్ల విమతమయిన పదార్థ సమూహము సుఖ దుఃఖమె రూపముగా గల కారణములు గలది. ఏది దేనితోఁ గూడియుండునో అది ఆదే కారణముగాఁ గలది ఎట్లనఁగా, బంగారముతోఁగూడిన భూషణాదులు బంగారమె కారణముగాఁగలవి. అందువల్ల - అట్లును ఇది అట్లేయగును: అని.

అందు జగత్కారణమందు సుఖాత్మకమైనది సత్త్వము, దుఃఖాత్మకమైనది రజస్సు, మోహాత్మకమైనది తమస్సు అని త్రిగుణాత్మకత్వము సిద్ధించినది. అట్లే ప్రత్యేకముగా పదార్థములు త్రిగుణములు గలిగి యుండు

వములోనికి వచ్చుచున్నవి. ఎట్లన, మైత్రుని భార్యయయిన సత్యవతి యందు మైత్రునికి సుఖము ఆవిర్భవించుచున్నది. వానికి సత్త్వగుణము ప్రాదుర్భవించుచున్నది గనుక. వాని సపత్నులకు దుఃఖము గలుగుచున్నది. వారికి రజోగుణము పుట్టుచున్నది గాన. ఆమెను పొందని చైత్రునికి మోహము గలుగుచున్నది. వానికి తమోగుణము పుట్టుటవల్ల. ఇట్లు ఇతరమైన ఘటాదులు పొందబడి సుఖముగూర్చుచున్నవి, ఇతరులు వానినపహరింపఁగా దుఃఖమును గూర్చుచున్నవి. తటస్థునికి ఉపేక్షావిషయములగుచున్నవి. ఉపేక్షా విషయమగుటయనఁగా మోహము. ముహ వై చిత్త్యే (విచిత్త్వే) అను ధాతువునుండి మోహశబ్దము నిష్పన్నమగుచున్నది. కాన ఉపేక్షింపదగిన వానిలో చిత్తవృత్తి పుట్టుటలేదు గాన. అందువల్ల పదార్థసమూహము సుఖదుఃఖ మోహరూపమైనదియై త్రిగుణ ప్రధానకారణకముగాఁ దెలియబడుచున్నది. అట్లను శ్వేతాశ్వతరోప నిషత్తులో వినఁబడుచున్నది.

> అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం। బహ్వీః ప్రజాః
> సృజమానాం సరూపాః
> అజో హ్యేకో జుషమాణో ऽ నుశేతే। జహాత్యేనాం
> భుక్త భోగాత్మ జోऽన్యః (సాం. కా. 4. 5)

పుట్టునదియు ఒకటియు ఎఱుపు తెలుపు నలుపు రంగులుగల సమానరూపమైన ప్రజలను సృజించుచున్నదియునగు ప్రకృతిని పుట్టని వాడును ఒకడునైన పురుషుడు సేవించుచున్నవాడై అనుసరించుచున్నాడు. ఇంకొక అజుడు ముక్తపురుషుడు భుక్తభోగముఅగల ఈ ప్రకృతిని విడచుచున్నాడు.

ఇందులోహిత శుక్లకృష్ణ శబ్దములు రంజత్వప్రకాశకత్వాऽవరకత్వ సాధర్మ్యమువల్ల రజస్సత్త్వతమో గుణ త్రయమును ప్రతిపాదించుచున్నవి.

మఱి అచేతనమగు ప్రధానము చేతనముచే అధిష్ఠానము కానిదై మహదాది కార్యమునందు పని చేయదు. కనుక అధిష్ఠాతయయిన యొక చేతనము ఉండి యుండవలయును. కనుక సర్వార్థములను దర్శించు పరమేశ్వరుని స్వీకరింపవలయునన్నచో అది సంగతము గాదు. అచేతనమైన

ప్రధానమునకును ప్రయోజనమును బట్టి ప్రవృత్తి యుపపన్నమగుచున్నది గదా. చేతనాధిష్ఠానము లేని యచేతనము పురుషార్థము కోసము ప్రవర్తించుచుండుట చూడఁబడుచున్నది. ఎట్లన, అచేతనమైన క్షీరము బిడ్డల కొఱకుఁ బ్రవర్తించుచున్నవి గదా. అచేతనమైన జలము లోకోపకారము నకై ప్రవర్తించుచున్నది. ఇట్లే ప్రకృతి అచేతనమైనను పురుషుని విమోక్షము కొఱకు ప్రవర్తించుచున్నది. అదియుఁ జెప్పఁబడినది.

"వత్స వివృద్ధి నిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తి రజ్ఞస్య
పురుష విమోక్ష నిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య
(సాం. కా. 57.)

"పరమేశ్వరుఁడు కరుణతోఁ బ్రవర్తించుచున్నాఁడు" అను పరమేశ్వరాస్తిత్వవాదుల డిండిమము పనికిమాలినదైనది. ఇందు వికల్పములు ఉపపన్నములు గాకపోవుటవల్ల అతడు (పరమేశ్వరుఁడు) సృష్టికిఁబూర్వమె ప్రవర్తించుచున్నాఁడా లేక సృష్టికి తర్వాతనా?

సృష్టికిఁ బూర్వము ప్రవర్తించుచున్నాఁడన్నచో మొదట శరీరము లేకపోవుటవల్ల దుఃఖములే యుత్పన్నము కాకపోవును. అపుడు జీవుల దుఃఖములను పోగొట్టు కోరిక యుపపన్నము గాదు. రెండవ పక్షములో పరస్పరాశ్రయ దోషము ప్రసక్తమగును. కరుణచే సృష్టించు సృష్టియందు కారుణ్యము అని యన్యోన్యాశ్రయదోషము పట్టుచున్నది. కనుక చేతనము లేని యచేతనమయిన ప్రధానము గూడ మహదాది రూపముగా పరిణమించుట పురుషార్థ (పురుషుడనఁగా ఈశ్వరుఁడు గాఁడు) ప్రయోజనమును బట్టియే యగును. అది ప్రధానమునకును పురుషునికి గలిగి సంయోగము నిమిత్తముగాఁ గలది. ఎట్లన, వ్యాపారము లేని పురుషుని సన్నిధానములో ప్రధానమునకు వ్యాపారము గలుగుట యుక్తముగానే యున్నది. ప్రకృతి పురుషుల సంబంధము కుంటివానికి గ్రుడ్డివానికి వలె పరస్పరాపేక్షయె నిబంధనముగాఁ గలది. ప్రకృతి భోగ్యముగా నుండి భోక్తయయిన పురుషుని అపేక్షించును. పురుషుఁడు గూడ భేదమును గ్రహింపకపోవుట వలన బుద్ధి

్ఛాయులు నుండుటచే అందున్న దుఃఖత్రయమును వారింపఁదలచినవాఁడై
కైవల్యమును కోరుచున్నాఁడు. అది ప్రకృతి పురుష వివేకమె నిబంధన
ముగాఁ గలది. ప్రకృతి పురుష వివేకము లేనిదే కైవల్యము గలుగదు కాన
పురుషుఁడు కైవల్యము కొఱకు ప్రధానమును గోరును. ఎట్లనఁగా ఒక
కుంటివాఁడు ఒక గ్రుడ్డివాఁడును ఇద్దఱు కలిసి బాటలో ఏదో ప్రయోజనము
నకై వెళ్ళుచున్నవారై దైవకృతమయిన యుపప్లవము వల్ల సాయము లేని
వారై పరిత్యక్తస్వార్థులై మెల్ల మెల్లఁగా నిటునటు తిరుగుచు భయాకులులై
దైవవశము వల్ల కలిసికొందురు. అపుడు గ్రుడ్డివాఁడు కుంటివానిని తన
భుజముపై నెక్కించుకొనును. అట్లు ఎక్కించుకొని కుంటివానికి కన్నులు
న్నవి గాన వాఁడు చూపిన మార్గముతో గ్రుడ్డివాడు తన కిష్టమైన చోటకు
పోవును. కుంటివాఁడు కూడ భుజముపైఁ గూర్చుండి తనకిష్టమైన చోటికి
పోవును. అట్లు పరస్పరాపేక్ష గల ప్రధాన పురుషులను బట్టి సృష్టి బయులు
దేఱుచున్నది. అదియుఁ జెప్పఁబడినది.

"పురుషస్య దర్శనార్థం, కైవల్యార్థం తదా ప్రధానస్య
పంగ్వంధవ దుభయోరపి సంబంధ స్తత్కృతః సర్గః। (సాం. కా. 21.)

సరే బాగున్నది. ప్రకృతి యొక్క ప్రవర్తన పురుషార్థమునకై
యగుఁగాక. మఱి నివృత్తి యెట్లు ఉపపన్నమగునన్నచో దానికి జవాబిది-
తన దోషములను జూచిన భర్తను స్వైరిణి తిరిగి చేరనట్లు, ప్రయోజనము
తీరిన నర్తకి నర్తనమునుండి మరలినట్లు ప్రకృతి కూడ అట్లే నివర్తించును.
అదియుఁ జెప్పఁబడినది —

రంగస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్
పురుషస్య తథాఽఽత్మానం ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః (సాం. కా. 59.)

ఇట్లు నిరీశ్వర సాంఖ్యశాస్త్ర ప్రవర్తకులైన కపిలాచార్యుల మతాను
యాయుల మతము చెప్పఁబడినది.

ఇది సాయణ మాధవీయమైన సర్వదర్శన సంగ్రహములో సాంఖ్య
దర్శనము.

## ప తం జ లి

పతంజలి చరిత్ర మనకు సరిగా తెలియదు. ఇతడు వ్రాసిన యోగ సూత్రములకు వ్యాస భాష్యమను వ్యాఖ్యానము కలదు. దానినిబట్టి ఇతఁడు వ్యాసునికి పూర్వుడని యనుకొనవలసివచ్చుచున్నది మహాభారతాది కర్త వ్యాసుడును ఈ వ్యాసుడును ఒకరు అవునో కాదో చెప్పలేము. సాంఖ్య దర్శనమును నిరీశ్వర సాంఖ్యమనియు ఈ పతంజలి రచించిన యోగ దర్శనమును సేశ్వరదర్శనమని యందురు. ఇది సాంఖ్యదర్శనము తరువాతిదై యుండును. అందుచేత ఈ పతంజలి సాంఖ్యదర్శన కర్తయైన కపిలుని తరువాతివాడై యుండు.

యోగేన చిత్తస్య పదేన వాచామ్
మలంశరీరస్య తు వైద్యకేన
యోఽపాకరోత్తం ప్రవరం మునీనామ్
పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి.

అను నీ శ్లోకమును బట్టి పతంజలి యోగ దర్శనమునే కాక వ్యాకరణ మహా భాష్యమును చరకము అని ప్రసిద్ధి గల వైద్య గ్రంథమును కూడ వ్రాసెనని తెలియుచున్నది.

— — —

ఇంక

## పాతంజల దర్శనము

ఇపుడు సేశ్వరసాంఖ్య ప్రవర్తకులైన పతంజలి మొదలయిన మునుల మతము ననుసరించువారి మతము చెప్పఁబడుచున్నది.

అందు సాంఖ్య ప్రవచనము అను మాఱు పేరు గల యోగ శాస్త్రము

తంజలిచే రచింపఁబడినది. అది నాలుగు పాదములతోఁ గూడినది. అందు ుదటి పాదమున "అథ యోగానుశాసనం (పా. యో. సూ. 1. 1. 1.) ఃటి యింక యోగానుశాసనము ఆరంభింపఁబడుచున్నది." అని యీ విధ ుగా యోగ లక్షణమును జెప్పి వివరముగా సమాధిని భగవంతుఁడగు పతం లి నిర్దేశించెను. రెండవ పాదమున తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియా యోగః (పా. యో. సూ. 2. 1.) తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ధ్యానము అనునవి క్రియా యోగములు." ఇవి మొదలుకొని ్యానము నుండి లేచినవాని చిత్తమునకు క్రియాయోగమును యమాదులైన రు యిదు బహిరంగములయిన సాధనములు చెప్పఁబడెను. మూఁడవ పాద ున "దేశబంధశ్చిత్తస్య ధారణా (పా. యో. 3. 1.) చిత్తధారణము దేశ ంధము." మొదలుకొని సంయమ పదమున కర్థమైన ధారణ ధ్యానము మాధి అను అంతంగములును వానికవాంతర ఫలములైన విభూతి సమూహ ును జెప్పఁబడినవి. నాలుగవ పాదములో "జన్మౌషధి మంత్ర తపః సమా ిజాః సిద్ధయః (పా. యో. 41.) జన్మవల్ల ఓషధులవల్ల మంత్రమువల్ల ప్పస్సువల్ల సమాధివల్ల అణిమాదులు సిద్ధించును." ఈ మొదలుకొని సిద్ధుల ివరములతోఁ గూడఁ బరమ ప్రయోజనమైన కైవల్యము చెప్పఁబడినది. ప్రధానములు మొదలైన ఇరువది యైదు తత్త్వములే ఇందును సమ్మతింపఁ ిడినవి. క్లేశకర్మ జన్మాయుర్భోగ రూప విపాకముల సంస్కారములచే ్పృశింపఁబడని పురుషుఁడు స్వేచ్ఛగా వివిధ శరీరములను ఆధారము చేసి ొని (ధరించి) లౌకిక వైదిక సంప్రదాయములను ప్రవర్తింపఁజేసి సంసా ాగ్నిలో తపించుచున్న ప్రాణులను అనుగ్రహించు పరమేశ్వరుఁడు ఇరు ిది యాఱవ తత్త్వముగా నిరూపింపఁబడెను.

సరేకాని, తామరాకుపలె క్లేశాదులచే అంటరాక నిర్లిప్తుఁడైన వానికి తపింపఁబడు స్వభావము ఎట్లు కుదురును? అందువల్లనే గదా పరమేశ్వరుఁడు ాని అనుగ్రహించునని కక్షగాఁజేయఁబడుచున్నది అన్నచో దానిని గూర్చి చెప్పఁబడుచున్నది. తపింపఁజేయు రజోగుణముచే తపింపఁదగిన సత్త్వము గుణము బుద్ధిగా మాఱుచున్నదిగాన సత్త్వము తపింపఁబడఁగా సత్త్వమందు

ఆరోపింపఁబడుటచేత సత్త్వమున కభిన్నుఁడుగా గ్రహింపఁబడు పురుషుఁడు గూడ తపింపఁబడుచున్నాఁడని యందుము. అది ఆచార్యులచే నిట్లు చెప్పఁబడినది —

"సత్త్వం తస్య బుద్ధి భావేన వృత్తం
భావా యే వా రాజసా స్తాపకా స్తే
తస్యా భేద గ్రాహిణీ తామసీయా ప్రవృత్తి
స్తస్యాం తస్య తత్యుక్త ఆత్మా" అని.

బుద్ధి రూపముగా నున్న సత్త్వము తపింపఁదగియున్నది. ఏ రాజస భావములు గలవో యవి తపింపఁజేయునవి. తపింపఁదగి అభిన్నముగా గ్రహింపఁజేయు తమోగుణ ప్రవృత్తి ఏది యున్నదో దానియందు ఆత్మ తపింపఁదగి యున్నది." అని పంచశిఖుఁడును చెప్పెను.

"అపరిణామినీహి భోక్తృ శక్తి రప్రతి సంక్రమా చ పరిణామిన్యర్థే ప్రతి సంక్రాంతేవ తద్వృత్తి మను పతతీతి" పరిణమించని భోక్తృ శక్తి ఇతరముగా ప్రతి సంక్రమించనిదై యుండి కూడి పరిణమించు వస్తువునందు ప్రతి సంక్రమించినది వలె అ పరిణామ వృత్తి ననుసరించుచున్నది " అని. భోక్తృ శక్తి యను దానిచే చిచ్ఛక్తి చెప్పఁబడుచున్నది. అదియు ఆత్మయె. పరిణమించు వస్తువయిన బుద్ధి తత్త్వమందు ప్రతి సంక్రమించినది వలె ప్రతిబింబించినది వలె ఆ బుద్ధి వృత్తి ననుసరించుచున్నది గాన బుద్ధియందు ప్రతిబింబించిన యాచిచ్ఛక్తి బుద్ధి ఛాయను పొందుటచేత బుద్ధి వృత్తి అనుకరింపఁజేయు చున్నది యని భావము. అట్లు శుద్ధుఁడైనను పురుషుఁడు బుద్ధిలోని విషయాకార రూప ప్రత్యయమును చూచును. దానిని చూచుచు దాని స్వరూపము గానివాఁడైనను దాని స్వరూపముగా ప్రతిభాసించుచున్నాఁడని దాని యర్థము. ఇట్లు తపింపఁబడుచున్న పురుషుఁడు ఆదరముతో నైరంతర్యముగా దీర్ఘకాలము అను బంధించియున్న యమ నియమాదులనెడి అష్టాంగ యోగములను అనుష్ఠించుటచేతను పరమేశ్వర ధ్యానము చేతను సత్త్వ పురుషునికంటె అన్యుఁడను అనుభేదప్రతీతి నాశము పొందకపోఁగా అవిద్యాదులయిన పంచ క్లేశములు సమూలముగా పెల్ల

పింపఁబడినవగును. కుశలములు అకుశలములునయిన కర్మాశయములు సమూలముగా నశింపఁజేయఁబడినవగును. ఇంక అపుడు నిర్లిప్తుడైన పురుషుఁడు కేవలముగ తానొక్కఁడుగా నుండుటయె కైవల్యము అని సిద్ధించినది.

అందు "అథ యోగానుశాసనం (పా. యో. 1. 1.) మఱి యింక యోగానుశాసనము ప్రారంభింపఁబడుచున్నది అను సూత్రముచేత పరిశీలించువారి ప్రవృత్తికంగమైన విషయప్రయోజన సంబంధాధికారి రూపమైన యనుబంధ చతుష్టయము ప్రతిపాదింపఁబడుచున్నది. అందు "అథ" "మఱి" అను శబ్దము అధికారార్థముగా స్వీకరింపఁబడుచున్నది. మఱి 'అథ శబ్దమునకు అనేకార్థములు సంభవించుచుండఁగా ఎట్లు ఆరంభార్థత్వ పక్షములో పక్షపాతము చూపబడుచున్నది. 'అథ' శబ్దమునకు మంగళాద్యనేకార్థములు నామలింగానుశాసనములో చెప్పఁబడెను. "మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ" అని యమర నిఘంటువు (3. 3 246). ఇందు ప్రశ్నకార్త్స్న్యార్థములు సంభవింపకపోయినను ఆనంతర్య మంగళ పూర్వ ప్రకృతాపేక్షరంభ రూపమైన నాలుగు అర్థములు సరిపోవుచుండఁగా, ఆరంభార్థత్వము ఉపపన్నము గాదన్నచో ఇట్లు తలఁపరాదు. వికల్పములను సహింపకపోవుట వలన అథ శబ్దమునకు ఆనంతర్యార్థము చెప్పవలెను అను పక్షములో దేనికో ఒకదానికంటె తరువాత అని యర్థము చెప్పవలయునా లేక పూర్వప్రవృత్తములైన శమాద్య సాధారణ కారణముల కంటె తరువాత అని యర్థము చెప్పవలయునా? మొదటి యర్థము చెప్పరాదు. "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్ (భగవద్గీత. 3. 5 ) అను న్యాయముచేత సర్వజీవులు తప్పక ఏదో యొకటి చేసి యింకొకటి చేయును అను సంగతి చెప్పకుండనే ప్రాప్తించుచున్నది గాన అథ శబ్దమును చెప్పుట వ్యర్థమగును గదా. ఇంక రెండవ పక్షమును సరిగాదు —

శమాదుల తరువాత యోగము ప్రవర్తించినను యోగానుశాసన ప్రవృత్తికనుబంధముగా స్వీకరింపఁబడుటచే దానికి అథ అన్నది శబ్ద పూర్వకముగా ప్రాధాన్యము లేదు. శబ్ద పూర్వకముగా ప్రధానమైన అనుశాసన

మునకు శమాదుల యనంతరత్వము అధ శబ్దమునకు అర్థము ఎందుకు కాద అని అనవచ్చుననరాదు. అనుశాసనమన్నది శాస్త్రమును గూర్చి చెప్పెను అనుశాసింపఁబడును లక్షణములు సంప్రజ్ఞాతాది భేదములు యోగోపాయములు ల మోక్ష ఫలములతో గూడ యోగము దేనిచే వ్యాఖ్యానింపఁబడునో అది అను శాసనము అను వ్యుత్పత్తిని బట్టి. అనుశాసనము తత్త్వజ్ఞానఖ్యాపనము తర వాతనే అగును గాన శమాదుల తరువాతనే అది కలుగుననెడి నియమము లేదు. జిజ్ఞాసయు జ్ఞానము శమాదుల తరువాతనగునని చెప్పఁబడుచున్నది—

తస్మాచ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యేత్ (బృ. 4 4. 23) శమము గలవాఁడె దమము గలిగిన వాడై ఉపరతి తితిక్ష సమాధి అనునవి ఆత్మయందు ఆత్మను చూడవల యును."

అధ శబ్దమునకు తత్త్వజ్ఞానమును ప్రవేశింపఁజేసిన తరువాత అని యును అర్థము చెప్పరాదు. అది సంభవించినను శ్రోతల ప్రతిపత్తి ప్రవృ త్తులకు ఉపయోగము లేకపోవుటచేత నీకుఁ గూడ నిశ్శ్రేయస హేతువుగా యోగానుశాసనము ప్రమాణయుతము అగునా కాదా? మొదటి పక్షమున నిశ్శ్రేయస హేతువు గాకపోయినను అది యుపాదేయము గావలసివచ్చును. రెండవ పక్షములో నిఃశ్రేయస హేతువున్నను అది విడువదగినది కావలసి వచ్చును.

"అధ్యాత్మ యోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి" (కఠ 2. 12.) అధ్యాత్మ యోగ జ్ఞానముచే దేవుని తెలిసికొని ధీరుఁడు హర్ష శోకములను పొందఁడు. అను శ్రుతిని బట్టియు సమాధా వచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి (గీత. 2. 53.) సమాధిలో బుద్ధి ఎపుడు అచలమై యుం డునో అపుడు యోగము పొందెదవు." అను స్మృతిని బట్టియు ఇది నిశ్శ్రేయ సమునకు నిదానమగుట నిశ్చితము కనుకనె శిష్య ప్రశ్న తపశ్చరణ రసాయనాదుల నుపయోగించిన తరువాత అను నర్థము గూడ పరాకృత మైనది "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా (బ్ర. సూ. 1. 1. 1.) మఱి యింక బ్రహ్మ

జిజ్ఞాస చేయవలసి యున్నది. అన్నచోట నైతే బ్రహ్మ జిజ్ఞాస ఆరంభిం చుటకయితే అధికార యోగ్యము గాదు. కాన అధికారము కోసము అని పరి త్యజించి సాధన చతుష్టయము సంపత్తులు గల అధికారి కోసము అని చెప్పు టకైశమదమాది వాక్య విహితమైన శమాదుల తరువాత అని అథ శబ్దార్థముగా శంకరాచార్యులు నిర్ణయించిరి. లోనీ అథశబ్దమునకు ఆ తరువాత అని యర్థము కాకపోవుఁగాక. అది మంగళార్థక మెందుకుఁగాదు. అనఁగా మంగళము వాక్యార్థములో నన్వయించక పోవుట వలన దానికి మంగళార్థము చెప్పరాదు. మంగళ మనఁగా అభీష్టావాప్తియె గదా. అభీష్ట మనఁగా సుఖప్రాప్తి యును సకల దుఃఖ పరిహారమును గదా. యోగానుశాసనము సుఖ దుఃఖ నివృత్తులలో ఏదో యొకటి కాదుగాన దానికి మంగళార్థకత్వములేదు. కనుక యోగానుశాసనము మంగళము అనునది యుపపన్నముకాదు. మద్దెల ధ్వని వలె అథ శబ్ద శ్రవణము కార్యము గాన మంగళము వాచ్యము గాని లక్ష్యముగాని అగుట అసంభవమగుట వలనను. అర్థికార్థము వాక్యార్థములో నివేశమును పొందనట్లే కార్యమును వాక్యార్థములో నివేశింపదు. ఏలయన అది పదార్థము కాకపోవుటతో సమానము గాన. పదార్థమే వాక్యార్థములో సమన్వయించును. అట్లుగానిచో శబ్దమె ప్రమాణమును వారికి శబ్దాకాంక్ష శబ్దముచేతనే పూరింపఁ బడునన్న భంగము కావలసి వచ్చును. మఱి ప్రారం భింపఁ దలచిన ప్రబంధమునకు పరిసమాప్తి కలుగుటకు విరుద్ధములైన విఘ్నసముదాయమును శాంతింపఁ జేయుటకును, శిష్టాచారమును పరిపా లించుటకును శాస్త్రారంభములో మంగళను ఆచరింపవలయును గదా. "మం గళా దీని మంగళ మధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే, ఆయుష్మ త్పుత్రకాణి వీర పురుషకాణిచ భవంతి (పాతంజల మహాభాష్య. పుట. 740. శాస్త్రములు మంగళములు ఆదియందు మధ్యయందు చివర చేయబడినవై ప్రసిద్ధి కెక్కినవని. అవి ఆయుష్మంతులైన పురుషులు గలిగి వీరపురుషులు గలిగి నవై ప్రథితమైనవి." అని యుభియుక్తుల వచనముల వలనను మంగళార్థ కత్వము అథ శబ్దమునకు చెప్పవచ్చును.

"ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా
కంఠంభిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ"

ఓంకారమును అథశబ్దమును రెండును బ్రహ్మకంఠమును భేదించుకొని వెడలినవి కనుక ఆ రెండు శబ్దములును మంగళార్థకములే: అను స్మృతిని బట్టియు, అట్లే కూడ" వృద్ధిరాదైచ్ (పా.1.i.1.) ఇత్యాదులందు వృద్ధి మొదటి శబ్దములకువలె అథశబ్దమును మంగళార్థకమగునన్నచో ఇట్లు తలపరాదు. ఏలయన, ఇతరార్థమును జెప్పుటకయి ప్రయోగింపబడిన 'అథ' అను శబ్దము వేణు వీణాదుల ధ్వనివలె శ్రవణ మాత్రము చేతనే మంగళ ఫలముగా ఉపపన్నమగుచున్నది కనుక. అర్థాంతరారంభ వాక్యార బుద్ధి ఫలముగాఁగల అథ శబ్దమునకు ఇతర ఫలము గలుగుట ఎట్లు అన్నచో— ఇతర ఫలముకై తీసికొని పోఁబడు నీటి బిందెలను శుభశకునముగా పొందినట్లు అది సంభవించును. దీనివల్ల స్మృతికి వ్యాకోపములేదు. ఓంకారము అథ శబ్దమును మంగళ బోధకములని మంగళ ప్రయోజనములుగా వివక్షించుట వలన నట్లు ప్రవృత్తి గలుగుచున్నది గదా.

మఱి అథ శబ్దము పూర్వ ప్రకృతములను అపేక్షించునదియుఁ గాదు. ఏలయనఁగా, ఫలమును బట్టి అనంతర్యార్థమునకు వ్యతిరేకము లేకుండ ఇది వరకటి దోషములు కలుగు చున్నవి. ఏమి ఈ యథ శబ్దము, అధికారము కొఱకా? లేక అనంతర్యార్థమును జెప్పుటకా? మొదలగు విమర్శ వాక్యములో పక్షాంతరము చెప్పుటయందు అది సంభవించినను ప్రకృతమున అది సంభవింపదు. కాన ఇంక మిగిలిన అధికార పదముచేఁ దెలియఁ దగిన ప్రారంభమను నర్థమును నథశబ్దము తెలుపునని విశేషను చెప్పబడుచున్న 'అథైష జ్యోతిః, అథైష విశ్వజ్యోతిః, అనుచోట ఎట్లో అథశబ్దము క్రతు విశేష ప్రారంభార్థముగా గ్రహింపబడెనో అథ శబ్దానుశాసనం (పాతం భా 1.1.) అనుచోట ఎట్లు వ్యాకరణ శాస్త్రాధికారార్థముగా గ్రహింపఁబడెనో అట్లే ఇక్కడను: ఈ సంగతే వ్యాస భాష్య వివరణములోఁ జెప్పఁబడెను. దానిగిట్లు వాచస్పతి వాఖ్యానించెను. "ఈ అథ శబ్దమునకు అధికారార్థము చెప్పు పక్ష

ఖ్యలో శాస్త్రముచే ప్రస్తావింపఁబడిన యోగము ఉండుట వలన సమస్త శాస్త్ర ాత్పర్యార్థ వ్యాఖ్యానముచే శిష్యునికి సుఖబోధ ప్రవృత్తి కలుగునని అథ బ్దమునకు అధికారార్థత్వము ఉపపన్నము" అని.

సరే 'హిరణగర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః"

హిరణ్యగర్భుఁడు యోగమును జెప్పిన వాఁడు. ఇంకొక ప్రాచీనుఁడెవ్వఁ ను జెప్పలేదు. అను యాజ్ఞవల్క్య స్మృతిని బట్టి పతంజలి యోగమును ూర్చి జెప్పినట్లగును? అనుచో నిజమె. కనుకనె అక్కడక్కడ పురాణాదు లో విశేషించి యోగము విప్రకీర్ణముగా ఉండుటచే గ్రహింప శక్యము గుట లేదని తలఁచిన భగవంతుఁడగు పతంజలి దయాసముద్రుఁడయి ాని పదమును గ్రహించి అనుశాసనము నారంభించెను గాని సాక్షాత్తుగా ాసింపలేదు. ఇంక ఈ అథ శబ్దము అధికారార్థము కాన అపుడీ వాక్యార్థము ంపన్నమగుచున్నది. "యోగాను శాసనమను శాస్త్రము అధికరింపఁ బడి ఁదిగాఁ దెలియ వలయును. కనుక ఈ అథ శబ్దము అధికారమును తెలి యుఁ జేయునది గాను మంగళార్థకముగాను ఉన్నదని సిద్ధించినది.

శాస్త్రములో వ్యుత్పాద్యమగుటచే సాధనములతోఁ గూడిన యోగము సఫలమైన విషయము. దాని వ్యుత్పాదనము అవాంతర ఫలము వ్యుత్పాదింపఁబడిన యోగమునకు కైవల్యము పరమ ప్రయోజనము. యోగ్యము వ్యుత్పాద్యము. శాస్త్రము వ్యుత్పాదకము. ఈ రెండింటికి వ్యుత్పాద్య వ్యుత్పాదకత్వము సంబంధము. యోగము సాధనము, కైవల్యము సాధ్యము. ఈ రెండిటికి సాధ్య సాధన భావ లక్షణ సంబంధము. అది శ్రుత్యాదులలోఁ బ్రసిద్ధమై యున్నదని యిదివఱకే చెప్పఁబడినది. మోక్షమును గోరువారలే దానిని జదువుట కధికారులని అర్థము సిద్ధించినది. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా (బ్ర సూ. 1.1.1.) ఇత్యాదులందు అర్థమువల్ల అధికారి సిద్ధిగలిగినది గదా అది ఆ శంకింపరాదు. అందు అథ శబ్దముచేత ఆనంతర్యము జెప్పుటచే అధికారి యను నర్థమును సిద్ధించుచుండఁగా అర్థాత్తు సిద్ధించినదను శంక యుదయించుటలేదు గదా? కనుకనే శ్రుతి ప్రాప్తించుచుండగాఁ బ్రకర

ణాదులకు అవకాశములేదు 'అని చెప్పఁబడినది. దీని యర్థమిది :—ఎక్కడ శ్రుతిచే అర్థము లభ్యముగాదో అక్కడే ప్రకరణాదులు తదర్థమును బోధించును. ఇతరమగుచోటఁగాదు. ఎక్కడైతే శబ్దము వల్లనే యర్థము ఉపలబ్ధమగునో అక్కడ ఇంకొకటి సంభవింపదు. శీఘ్రముగా బోధించు శ్రుతిచే దాని వినియోగము బోధింపఁబడుటచే ఇంక ఆకాంక్షలేదు గాన ఇతరములకు అవకాశములేదు. మఱి శ్రుతిచే బోధింపబడిన యర్థములో తద్విరుద్ధార్థమును ప్రకరణాదులు సమర్పించునా? సమర్పింపవా? సమర్పించు ననరాదు· విరుద్ధార్థమును బోధించుట బాధితము గాన సమర్పింపవనుటయు సరికాదు. అట్లన్నచో అవి వ్యర్థములు గావలసి వచ్చును. అదే చెప్పఁబడెను– శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యా సమవాయములకు అర్థవిప్రకర్ష వలన పద దౌర్బల్యము గలుగును. (జైమిని. సూ 3.3.1.8.) అని.

"బాధికైవ శ్రుతిర్నిత్యం సమాఖ్యా బాధ్యతే సదా
మధ్యమానాంతు భాధ్యత్వం బాధకత్వ మపేక్షయా

"నిత్యము శ్రుతి బాధించునదే గాన సమాఖ్య ఎల్లప్పుడును బాధింపఁబడును. మధ్య యున్నవన్నియునైతే బాధ్యములే, అపేక్షను బట్టి శ్రుతి బాధనమగును." అనియు శ్రుతిని బట్టి పూర్వము ఇంకొక ప్రమాణము లేకపోవుగవల్ల శ్రుతి ప్రమాణమునకు బాధ కలుగదు. అట్లే సమాఖ్యకంటె ఇతరమైన ప్రమాణము లేదుగాన ఎప్పుడు సమాఖ్య బాధింపబడదు మధ్యగాను లింగాదులకైతే పూర్వమున్నదానితో కూడ ఒకచోట సన్నిపాతము కలుగగా బాధ్యత్వమును పరమైన దానితో గూడ ఒకచోట సన్నిపాతము కలిగిన యెడ బాధకత్వము కలుగునని భావము.

కనుక విషయాదులుండుట వలన బ్రహ్మను విచారించు శాస్త్రమువలె యోగాను శాసన శాస్త్రము ఆరంభింపఁ దగినదని స్థిరపడినది.

సరే మఱి వ్యుత్పాద్యమానముగా యోగమె ఇక్కడ ప్రస్తుతముగాని శాస్త్రము గాదన్నచో నిజమె. యోగము ప్రతిపాదింపఁదగినదిగా ప్రధానముగా ప్రస్తావింపఁబడినది. అదియు దానికి సంబంధించిన శాస్త్రముచేఁ

లుపఁబడుచున్నదని దానిని ప్రతిపాదించుటలోఁ గారణము శాస్త్రము. ఎట్లు దించు దేవదత్తుని వ్యాపారమైన పైకెత్తుట క్రిందకు దింపుట మొదలగు నులు సాధనములైన గొడ్డలియందె కనిపించును గాని కర్తయైన వృక్షాదు ందు గోచరింపవో అట్లే చెప్పినట్టి పతంజలి యొక్క ప్రవచన వ్యాపార మును అపేక్షించుటచే కరణమైన శాస్త్రముచే యోగ విషయము అధికరింపఁ డినది. అభిధాన వ్యాపారాపేక్షచేనైతే యోగమే ప్రతిపాదింపఁదగినదని భాగము. కనుక యోగశాస్త్రారంభము గౌరవమును పొందును. ఇట నుశాసింపఁదగిన యోగము చిత్తవృత్తి నిరోధమని చెప్పఁబడుచున్నది.

సరె కాని మఱి యోగము అను పదము 'యుజిర్యోగే' అనుదానిని ట్టి సంయోగార్థము కలది గాన ఇందు చెప్పఁబడిన యోగము సంయోగ మనె చెప్పను గాని నిరోధమును జెప్పదు. కనుక యాజ్ఞవల్క్యుఁడు —

"సంయోగో యోగ ఇత్యుక్తో జీవాత్మ పరమాత్మనోః

"జీవాత్మ పరమాత్మల సంయోగమె యోగము అని. ఇది సరియైనది దు. ఏలయున, జీవాత్మ పరమాత్మల సంయోగములోఁ గారణమైన ఎవరో యొకరి కర్మాదులు సంభవించవు గాన. అజ (ప్రధాన)ముతో సంగమును ణాదుఁడును గౌతముఁడును ఆక్షేపించిరి కూడ. మీమాంసకుల మతము నుసరించి దాని నంగీకరించినను నిత్య సిద్ధమైన ప్రధాన సంయోగము ాధ్యము కాకపోవుటచే శాస్త్రము విఫలమగుట అపన్నమగుచున్నది. అది క ధాతువులు అనేకార్థములు గలవి గాన యుజి ధాతువునకు సమాధ్యర్థము ప్పుట ఉపపన్నమగుచున్నది కూడ. అది యిట్లు చెప్పఁబడినది.

"నిపాతాశ్చోపసర్గాశ్చ ధాతవశ్చేతి తేత్రయః
అనేకార్థాః స్మృతాః సర్వే పాఠస్తేషాం నిదర్శనం

నిపాతలును ఉపసర్గలును ధాతువులు అను నీ మూడును అనేకార్థక ులు. వాని పాఠమె అందు నిదర్శనము. కనుకనే కొందఱు యుజధాతు ను సమాధ్యర్థమందును పఠించుచున్నారు. ఇట్లు చెప్పినచో యాజ్ఞ

వల్క్యుని స్మృతికి విరోధము గల్గునేయని తలపరాదు. అందున్న యోగ శబ్దము కూడ సమాధ్యర్థకమే యగును గదా.

"సమాధిః సమతావస్థా జీవాత్మ పరమాత్మనోః
బ్రహ్మణ్యేవ స్థితిర్యా సా సమాధిః ప్రత్యగాత్మనః

సమాధి యనఁగా జీవాత్మ పరమాత్మలు సమముగా నుండెడి యవస్థయె. ప్రత్యగాత్మ బ్రహ్మమందుండుటయె సమాధి యనఁగా.

అని యాజ్ఞవల్క్యుఁడే కూడ చెప్పెను. అదె భగవంతుఁడైన వ్యాసుడును చెప్పెను. "యోగః సమాధిః (యోగ. భా. వ్యా. 2. 1) యోగమనఁగా సమాధి యని. సరే కాని, అష్టాంగ యోగములో "చివరి యంగము సమాధి యని పతంజలి చెప్పెను.

సూ. యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధయోఽష్టాంగాని యోగస్య.

సూ. యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధులు అని యోగమునకు ఎనిమిది యంగములు (పాతం. యో. సూ. 2, 29.

యోగమే సమాధియుని చెప్పుట యెట్లు. మరి అంగియె అంగమగుట ఉత్పహింపదు. పోనీ ఉపకార్యుపకారక భావముచే నంగీకరింతమన్న అది దర్శపూర్ణమాస ప్రయాజాదులందును భిన్నాయతనములుగా ఉండుటచే మిగుల భేదమున్నది. దర్శపూర్ణమాస యాగము అంగిగాన ఉపకార్యమై యున్నది. ప్రయాజాదులలో అంగములు అవి దర్శపూర్ణమాసములకు ఉపకారకములు. అట్లు ఉపకార్యమైన యంగి యోగ సంబంధము వల్ల ఉపకారకమై అంగమైన సమాధి అత్యంత భిన్నమగుచున్నది. సమాధి భేదమున్నను అంగాదులకు అభేదము చెప్పవచ్చును. ధ్యేయవస్తువు మాత్రము ప్రకాశించు స్వరూపము లేనిదానివలె నుండు ధ్యానమె సమాధి. అని (పా. యో. 3. 3 చెప్పఁబడినది కూడ. ఆ ధ్యానమె ధ్యేయా ధేశవశమువల్ల ధ్యానధ్యాతృద్వ శూన్యమువలె నుండును. అదే సమాధి అని చెప్పుకొనవచ్చును. ఇట్లు నిర

పింపఁబడిన చరమాంగమును జెప్పి సమాధి శబ్దముచే అంగియగు యోగ మును అభేద వివక్షచే వ్యవహరించుట ఉపపన్నమగును. వ్యుత్పత్తి బలము వల్లనే అన్నిచోట్ల శబ్దము ప్రవర్తింపదు. అట్లు ప్రవర్తించుచున్నచో గచ్ఛతీతి గౌః వెళ్ళుచున్నది గాన గోవు అను వ్యుత్పత్తిని బట్టి నిలుచున్నది గోవు కాకపోవలసివచ్చును గదా. వెళ్ళు దేవదత్తుఁడు గూడ గోవు అయిపోవును గూడ. ప్రవృత్తి నిమిత్తమో ఇదివఱలోఁ జెప్పఁబడిన చిత్తవృత్తి నిరోధమే. అదియు "యోగశ్చిత్త వృత్తి నిరోధః" చిత్త వృత్తులను నిరోధించుటె యోగ మని చెప్పఁబడినది కూడ.

సరే కాని వృత్తులను నిరోధించుటె యోగమనుట అభిమతమైనచో ఆ చిత్తవృత్తులు జ్ఞాన రూపము లు గాన అవి యాత్మను ఆశ్రయించియుండును గాన వానిని నిరోధించుట కూడ ప్రధ్వంసపదముచేఁ దెలియఁదగినదై దానికి ఆశ్రయముఁగును. ఏలయన ప్రాగభావ ప్రధ్వంసములు సమానమైన ప్రతి యోగిని ఆశ్రయించి యుండుట నియమముగా నుండును. కాన అందు వల్లను గూడ

"ఉపయన్నపయన్ ధర్మో వికరోతి హి ధర్మిణమ్"

"పుట్టుచుగాని నశించుచుఁగాని ధర్మము ధర్మిని వికారపఱచును." ఉత్పత్తి వినాశములు గలదానిగా జేయును, అను న్యాయముచే ఆత్మ కూటస్థము అను దానిని పోగొట్టును గదా అన్నచో అదియును గుదురదు. నిరోధమునకుఁ బ్రతియోగులైన ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రాస్మృతి స్వరూపములయిన వృత్తులు అంతఃకరణాదులకు నింకొక పర్యాయ వాచియైన చిత్తమునకు ధర్మముగా అంగీకరించుట వలన. కూటస్థ నిత్యమైన చిచ్ఛక్తి పరిణామము లేనిదై విజ్ఞాన ధర్మమునకు ఆశ్రయమైనదగుటకుఁ దగనే తగదు. చితిశక్తి పరిణమించునది కాదన్నది సిద్ధింపదు అని తలఁపరాదు. ఏలయన, చితిశక్తి పరిణమించునది కాదు. అది ఎల్లపుడు జ్ఞాత కావున, ఏది యిట్లు కాదో అది అట్లు గాదు. ఎట్లన చిత్తాదులు అని యీ విధమైన యనుమానము సంభవించుచున్నది గనుక. అట్లే ఈ పురుషుఁడు పరిణమించువాఁడు అయినచో అపుడు పరిణామమన్నది ఎప్పుడో యొకసారి జరుగును గాన ఆ చిత్త

వృత్తులు ఎప్పుడును జ్ఞాతలగుట ఉపపన్నము కాకపోవును. చిదాత్ముఁడై ఎల్లపుడును అధిష్ఠాతగా ఉన్న పురుషుని ఏ యంతరంగము నిర్మలమైన సత్త్వమో అది కూడ ఎల్లపుడును అట్లే ఉన్నది కనుక. ఏయే వస్తువుచే దృశ్యము ఉపరక్తమై యుండునో ఆ దృశ్యము ఎల్లపుడును చిచ్ఛాయను పొందును గాన అట్లు భాసించుట ఉపపన్నమగుచున్నది గాన పురుషుఁడు నిస్సంగుఁడగును. అందుచేతను అతఁడు ఒకప్పుఁడైనను గూడ పరిణమించును అన్న శంక అవతరింపదు. చిత్తమైతే ఏ విషయముచే ఉపరక్తమగునో ఆ విషయము తెలియఁబడును, ఏ విషయముచే ఉపరక్తము కాదో అది తెలియఁబడదు. అది సూదంటురాయి వంటి వస్తువు జ్ఞానాజ్ఞానములకు కారణమైన ఉపరాగాను రాగములు గలది గాన ఇనుమువంటి ధర్మములు గల చిత్తము పరిణమించునది అని చెప్పఁబడుచున్నది.

మఱి అహంకారము గల చిత్తమును ఇంద్రియములును సర్వగతములు గాన సర్వ విషయములతో వానికి సంబంధము యుండును. కనుక అన్నిటికి అన్ని సమయములందు అన్నిచోట్ల జ్ఞానము ప్రసక్తమగునే అన్నచో అట్లనరాదు. ఏలయన, ఇంద్రియములు సర్వగతములైనను చిత్తము ఏ శరీరముతో వృత్తులు గలదై యుండునో ఆ శరీరముతోఁగూడ సంబంధము ఏ విషయములకుండునో వానియందే దానికి జ్ఞానము కలుగును. ఇతరములకుండదు కాన అతి ప్రసక్తి గలుగకపోవుచున్నది. కనుకనే సూదంటురాయివంటి విషయము ఇనుమువంటి చిత్తమును ఇంద్రియ ప్రణాళికతో సంబంధించి ఉపరంజింపఁజేయుచున్నదని చెప్పఁబడెను. కనుక వృత్తులు చిత్తధర్మములు గాని ఆత్మకు ధర్మములు గావు. అట్లు గూడ శ్రుతి యున్నది.

"కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా

ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యే తత్సర్వం మన ఏవ (బృ. 1. 5. 3.) అని "కామము, సంకల్పము, విచికిత్స, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, భయము అనునవి యన్నియు మనస్సే." అని.

చిచ్ఛక్తి పరిణమించునది కాదు అన్న సంగతి పంచశిఖాచార్యులచేఁ జెప్పఁబడెను. "అపరిణామినీ భోక్తృశక్తిరితి" భోక్తృశక్తి పరిణమించునది కాదు" అని. పతంజలిచేఁ గూడ "సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయః తత్ప్రభోః పురుషస్య అపరిణామిత్వాత్" చిత్తవృత్తులకు ప్రభువైన పురుషుఁడు పరిణమించువాఁడుకాడు గాన వానికి ఎల్లపుడు అవి తెలియఁబడియుండును." (పాత. యో. సూ. 4. 1. 8.) చిత్తము పరిణామము గలది అనుటలో అనుమానము ఇట్లు చెప్పఁబడుచు" చిత్తము పరిణమించు స్వభావము గలది జ్ఞాతాజ్ఞాత విషయములు గలది గాన శ్రోత్రాదులు వలె" అని.



ధర్మము, లక్షణము, అవస్థ, అను భేదములను బట్టి పరిణామము మూఁడు విధములుగాఁ బ్రసిద్ధమై యున్నది. ఎట్లనఁగా బంగారమునకు కడియము కిరీటములు కేయూరము మొదలగునవి. ధర్మమునకు వర్తమానత్వాదులు లక్షణ పరిణామము. నీలాద్యాలోకమునకు స్ఫుటత్వాదులు అవస్థా పరిణామము. కడియములు లోనగువానికి నవపురాణత్వాదులు అవస్థా పరిణామము. ఇట్లు ఇతరమైన చోటఁ గూడ వీలయినట్లుగా పరిణామములు మూఁడును ఊహించుకోవలయును. కనుక ప్రమాణాది వృత్తులు చిత్తధర్మములు గాన నిరోధము గూడ దానిని ఆశ్రయించినదే కనుక ఏమియు అనుపపత్తి లేదు.



మతి వృత్తులను నిరోధించుటయె యోగమని అంగీకరించినపుడు సుషుప్త్యాదులలో క్షిప్తమూఢాది చిత్తవృత్తులకు నిరోధము సంభవించుట వలన అవి గూడ యోగములు కావలసివచ్చును. అవి యోగమనుట యుక్తము గాదు. క్షిప్తాద్యవస్థలలో క్లేశములు నశించుట అసంభవము గాన, అవి నిశ్శ్రేయసమునకు శత్రువులు గదా, అదెట్లన, క్షిప్తమనఁగా, ఆయా విషయములందుఁ జిమ్మఁబడి అస్థిరముగా నున్న చిత్తమె. తమస్సముద్రములో మగ్నమై నిద్రావృత్తిచే భావింపఁబడినది మూఢమని చెప్పఁబడుచున్నది. క్షిప్తాదులతోఁ గూడిన చిత్తము విక్షిప్తమని చెప్పఁబడుచున్నది. విశేషమేమనఁగా,

"చంచలం హి మనః కృష్ణప్రమాథి బలవద్దృఢం (భ. గీ. 6. 34.)
అను న్యాయముచే మనస్సు అస్థిరమైనను ఒకానొకప్పుడు విషయస్థైర్యము గలుగుట సంభవించును గాన దానికి స్థైర్యము గలుగును. అస్థిరత్వమును స్వాభావికముగాని వ్యాధ్యాద్యనుశయములచేఁ బుట్టినది గాని కావచ్చును. అవే యిట్లు చెప్పఁబడెను.

సూ. వ్యాధిస్త్యాన సంశయ ప్రమాదాలస్యా విరతి
భ్రాంతి దర్శనా లబ్ధ భూమికత్వానవస్థిత
త్వాని చిత్తవిక్షేపా స్తేఽంతరాయాః (పా. యో. సూ. 30.)

"వ్యాధి, స్త్యానము, సంశయము, ప్రమాదము, ఆలస్యము, అవిరతి, భ్రాంతి దర్శనము అలబ్ధ భూమికత్వము అనవస్థతత్వము అనునవి చిత్త విక్షేపములు. అవి సమాధికి విఘ్నములు."

అందు దోషత్రయవైషమ్య నిమిత్తమైన జ్వరాదులు వ్యాధి. చిత్తము అకర్మగా నుండుట స్త్యానము. ఉన్నదా లేదా అను విరుద్ధకోటి ద్వయమును బొందిన జ్ఞానము సంశయము. సమాధి సాధనములు లేకపోవుట ప్రమాదము. శరీర వాక్చిత్తములు గౌరవముచల్ల ప్రవర్తింపకపోవుట ఆలస్యము. విషయాభిలాష అవిరతి. అది కాని దానియందు అది అను బుద్ధి కలుగుట భ్రాంతి దర్శనము. ఏదో కారణము వలన సమాధి భూమికను పొందకపోవుట అలబ్ధ భూమికత్వము. అది పొందఁబడినను చిత్తము నిలఁబడకపోవుట అనవస్థితత్వము అని దాని యర్థము.

కనుక వృత్తి నిరోధము యోగపక్షమందు శిక్షింప నర్హముగుచున్నదన్నచో ఇట్లు అనరాదు. విడువఁదగిన క్షిప్తాద్యవస్థలు మూఁడిటి అవృత్తిని నిరోధించుట యోగము అనుట సంభవింపకపోయినను స్వీకరింపఁదగిన ఏకాగ్రత, నిరుద్ధావస్థల వృత్తిని నిరోధించుట యోగముగుట సంభవించును గదా. ఏకతానమైన చిత్తము ఏకాగ్రమని చెప్పఁబడును. సకల వృత్తులను నిరోధించిన పిదప సంస్కార మాత్రమే శేషించిన చిత్తము నిరుద్ధమని చెప్పఁబడును.

ఆ సమాధియు రెండు విధములు. సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము అని. అందు ఏకాగ్రమైన చిత్తమందు ప్రమాణాది వృత్తులైన బాహ్య విషయముల నిరోధించుట సంప్రజ్ఞాత సమాధి. ప్రకృతి వివిక్తముగా నుండుటచే దీనియందు ధ్యేయము బాగుగాఁ దెలియఁబడును అను వ్యుత్పత్తిని బట్టి ఈ యర్థము సిద్ధించుచున్నది. అది నాలుగు విధములు 1 సవితర్కము 2 సవిచారము 3 సానందము 4 సాస్మితము అని.

సమాధి అనఁగా భావన అదియును కాఁబోవునది భావ్యము విషయాంతర పరిహారముచే చేతస్సునందు మరల మరల ప్రవేశించుట. భావ్యమును రెఁడు విధములు. ఈశ్వరుఁడు తత్త్వములు అని. అవియు జడములు, అజడములు అని రెండు విధములు. జడములు ప్రకృతి మహదహంకారాదులు ఇరవై నాలుగు. జడుఁడు గానివాఁడు పురుషుఁడు. అందు ఎప్పుడు స్థూలమైన పృథివ్యాదులను విషయములుగాఁ దీసికొని పూర్వాపర సంధానము చేత శబ్దార్థోల్లేఖ సంభేదము చేతను (తత్తదర్థ భావన చేతను) భావన ప్రవర్తించునో అది సవితర్కమను సమాధి ఎప్పుడు అంతమాత్రము అంతఃకరణము లక్షణముగాఁ గలిగిన సూక్ష్మ విషయమును ఆధారము చేసికొని దేశాది సహితముగా భావన ప్రవర్తించునో అది సవిచారము. ఎప్పుడు రజస్తమో లేశముతోఁ గూడిన చిత్తము భావింపబడునో అప్పుడు సుఖప్రకాశమయమైన సత్త్వోద్రేకము వలన సానందమగును. ఎప్పుడు రజస్తమో లేశముచే తిరస్కరింపఁబడు శుద్ధ సత్త్వమును ఆధారము చేసికొని ఏ భావన ప్రవర్తించునో అప్పుడు దానియందు సత్త్వము యొక్క న్యగ్భావము వల్ల చితిశక్తి యొక్క యుద్రేకమువల్ల సత్తామాత్రము అవశేషమగునది సాస్మిత సమాధి. అది పతంజలిచే నిట్లు చెప్పఁబడినది. "వితర్క విచారానందాస్మిత రూపానుగమాత్సం ప్రజ్ఞాతః (పాతం. యో. సూ. 1. 17.) అని. సర్వ వృత్తులను నిరోధించినపుడు అసంప్రజ్ఞాత మనుసమాధి కలుగును. సర్వ వృత్తి నిరోధము యోగమని యన్నచో సంప్రజ్ఞాతమందు వ్యాప్తి యుండదే. అందు సత్త్వ ప్రధానమైన సత్త్వ పురుషాన్యతాఖ్యాతి లక్షణమైన వృత్తి నిరోధింపఁబడకపోవుట వలన అన్నచో అది తుచ్ఛము. క్లేశ కర్మ

విపాకాశయములకు శత్రువైన చిత్తవృత్తిని నిరోధించుటే యోగమని యంగీకరించుట వలన క్లేశము అయిదు విధములుగాఁ బ్రసిద్ధమై యున్నది. "అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః క్లేశాః" అని. (పాతం. యో. సూ. 2. 3.) సరేకాని అవిద్య అన్నదానికి ఏ యర్థము చెప్పవలయును. అమక్షికము (మక్షికము లేకుండ) అన్నచోటవలె పూర్వపద ప్రాధాన్యమా? రాజపురుషుఁడు (రాజు యొక్క పురుషుఁడు) అన్నచోట వలె ఉత్తర పదార్థ ప్రాధాన్యమా? అమక్షికము దేశము (మక్షికములు లేని దేశము) అన్నచోట వలె అన్యపదార్థ ప్రాధాన్యమా? ఏ యర్థము చెప్పవలయును. పూర్వపదార్థ ప్రాధాన్యమని చెప్పినచో అవిద్యలో ప్రసజ్య ప్రతిషేదము (ప్రాప్తి పూర్వక నిషేధము) ఉపపన్నమైనవుడు (విద్యాప్రసక్తి పూర్వకా భావం నతు తత్సహ కృతం భావరూపమన్యత్) క్లేశాదులైన రకములు ఉపపన్నములు గావుగాన మొదటి యర్థము సరికాదు. అవిద్య అనుచోట స్త్రీలింగము ను ఉపపన్నము గాదు కూడ. ఏదో యొకదాని యభావముతోఁ గలిసియున్న విద్య క్లేశాదులకు పరిపంథి గాన దానికి బీజమగుట ఉపపన్నము గాదు. ఉత్తర పదార్థ ప్రాధాన్యమును అర్థము గాదు. "నిషేదార్థమునకుఁ గాని అస్త్యర్థములకు గాని బహువ్రీహియో, ఉత్తరపద లోపమో చెప్పవలయును" అను వృత్తికార వచనమును అనుసరించి అవిద్యమానయగు విద్య దేనికి గలదో అది అవిద్య బుద్ధి అను సమీపార్థము సిద్ధించుచుండఁగా ఆ యవిద్యకు క్లేశాదులు బీజమగుట ఉపపన్నము గాదు గాన అన్యపదార్థమును గాదు. వివేక ఖ్యాతి పూర్వకమైన సర్వ వృత్తులను నిరోధించుట వలనఁ గలిగినదానికి క్లేశాది బీజత్వము ప్రసక్తమగుట వలనను అస్మితాదులైన క్లేశములు అవిద్యకు నిదానములని కూడఁ జెప్పఁబడినది. "అవిద్యా క్షేత్రముత్తరేషాం ప్రసుప్తతను విచ్ఛిన్నోదారాణాం (పాతం. యో. సూ. 2. 4.) చిత్తములో నిద్రించియున్న తనువైన విచ్ఛిన్నమైన యుదారమైన అస్మితారాగద్వేషాభినివేశములకు అవిద్య క్షేత్రము.

అందు ప్రసుప్తత్వమనఁగా ప్రబోధ సహకారి కారణోవుట చేత అభివ్యక్తము గాకపోవుట. తనుత్వమనఁగా ప్రతిపక్షమును భావించుటచే శిథిల

మగుట. విచ్ఛిన్నత్వమనఁగా బలముగల క్లేశముచే తిరస్కారము. ఉదారత్వమనఁగా సహకారి దగ్గరగా నుండఁగా కార్యకారి యగుట. అది చస్పతి మిశ్రులచే వ్యాసభాష్య వ్యాఖ్యలో ఇట్లు చెప్పఁబడినది.

"ప్రసుప్తాస్తత్త్వ లీనానాం తన్వవస్థాశ్చ యోగినాం
విచ్ఛిన్నోదార రూపాశ్చ క్లేశా విషయ సంగినాం

తత్త్వమందు లీనులైన యోగుల దేహావస్థలు ప్రసుప్తములు. విషయ సక్తుల క్లేశములు విచ్ఛిన్నోదార రూపములును" అని.

ద్వంద్వ సమాసము వలె స్వతంత్ర పదార్థములు ఉన్నట్లు తెలియక పోవుట వలన ఉభయ పదార్థ ప్రధానమని అశంకింపరాదు. కనుక మూఁడు పక్షములలోఁ గూడ అవిద్య క్లేశాదులకు నిదానమన్న ప్రసిద్ధి తగ్గిపోవును అన్నచో అది కూడ రమణీయము గాదు. పర్యుదాస భేదశక్తిని ఆశ్రయించి అవిద్యా శబ్దముచేత విద్యకు విరుద్ధమైన విపర్యయ జ్ఞానము చెప్పఁబడుచున్నదని పెద్దలు అంగీకరించినారు గనుక, అదే చెప్పఁబడెను.

"నామ ధాత్వర్థ యోగేతు నైవ నఞ్ ప్రతిషేధకః
పదత్య బ్రాహ్మణా ధర్మౌ వన్యమాత్ర విరోధినౌ"

నామ ధాత్వర్థముల యోగమందైతే నఞ్ ప్రతి షేధకముగాదు భిన్నార్థకము ఆ నఞ్ అది అబ్రాహ్మణ (బ్రాహ్మణాన్య మాత్ర ధర్మ విరోధి పాపార్థములను) అని అధర్మములను అన్యమాత్ర విరోధులనుగాఁ జెప్పుచున్నది.

వృద్ధ ప్రయోగగమ్యోహి శబ్దార్థః సర్వ ఏవ నః
తేన యత్ర ప్రయుక్తో యోన నతస్మాదపనీయతే ఇతి

సర్వమైన శబ్దార్థము మనకోవృద్ధ ప్రయోగ గమ్యమై యుండును గాదా. అందుచే ఎందు ప్రయోగింప బడునో అది దాని నుండి తప్పుకొనదు.

వాచస్పతి మిశ్రులు గూడ "శబ్దార్థముల సంబంధము లోకాధీనాధారణ గలదనిరి. లోకములో నఞ్ ఉత్తర పదార్థ ప్రధానమైనను ఉత్తర పదాభిధేయ పర్యుదాసకత్వము దానికి విరుద్ధముగా అక్కడక్కడ ఉపలబ్ధ మగుట వలన ఇందును దానికి విరుద్ధమైన దాని యందు ప్రవృత్తి గలుగుచున్నది ఇది యంతయు ఉద్దేశించియె—

అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా (పాతం. యో. 2.5) అనిత్యము నిత్యమని అశుచిని శుచియని దుఃఖము సుఖమని అనాత్మము ఆత్మయని తలంచుట అవిద్య. అదికాని దానియందు అదియను బుద్ధి విపర్యము అని చెప్పినట్లయినది. అది యెట్లనఁగా, అనిత్యమైన ఘటాదులందు నిత్యత్వాభిమానము, అశుచి యగు కాయాదులందు శుచిత్వ జ్ఞానము.

స్థానాద్బీజాదుపష్టంభాన్నిష్యందాన్నిధనాదపి
కాయమాధేయ శౌచత్వా త్పండితా హ్యశుచిం విదుః

జననస్థానమగు జనన్యుదరమును బట్టి బీజమును (వీర్యమును) బట్టియు ఉపష్టంభమును పోషకమైన ఆహార పదార్థములను బట్టియు నిష్యందమును (ప్రస్వేదమును) బట్టియు మరణమును బట్టియు స్నానాదులచే ఆధేయమగు శౌచముగా గలదిగాన శరీరమును పండితులు అశుచియైన దానినిగా చెప్పుదురు" అని.

"పరిణామ తాప (వైషయిక1 అసహనాది జన్యశిష్టా లాభజన్య త్రిగుణ) సంస్కార దుఃఖైర్గుణ వృత్తి విరోధా చ్చ దుఃఖ మేవ సర్వం వివేకినః (పాతం. యో. సూ. 2. 15.

అను న్యాయము చేత దుఃఖమైన ప్రసక్చందన వనితాదులందు సుఖత్వారోపము గలుగు చున్నది. అనాత్మయైన దేహాదులందు ఆత్మబుద్ధి. అది యిట్లు చెప్పఁబడినది.

"అనాత్మనిచ దేహాదా వాత్మ బుద్ధిస్తు దేహినాం
అవిద్యా తత్కృతో బంధ స్తన్నాశో మోక్షఉచ్యతే"

దేహ ధారులకు అనాత్మ యగు దేహాదులందు అత్మబుద్ధి గలుగుట అవిద్య, దేహాదుల వలనఁ గలిగినది బంధము. ఆబంధనాశమె మోక్షమని చెప్పఁబడు చున్నది. "అని.

ఇట్లు ఈ యవిద్య నాలుగు పాదములు గలది. సరేకాని మఱి ఈయవిద్యా విశేషములందు కలిసియుండు ఏద్దైన యొక సామాన్య లక్షణమును వర్ణింపవలయును. అట్లు గానిచో విశేషము సిద్ధింపదు. అట్లును భట్టా చార్యులు జెప్పిరి.

"సామాన్య లక్షణం ముక్త్వా విశేషస్యైవ లక్షణం
నశక్యం కేవలం వక్తుమతోఽప్యస్యన వాచ్యతా"

సామాన్య లక్షణమును విడిచి విశేషమునకు లక్షణమును జెప్పుట అశక్యము. అయినను దీనికి వాచ్యత లేదు" అని.

అది కాని వాని యందు అది యని బుద్ధి అను సామాన్య లక్షణమును జెప్పుటచేత ఇదివరకె దీనికి సమాధానము చెప్పఁబడినది. కాన అదియు వాచ్యము గాదు.

సత్త్వ పురుషులతో నేనుంటినను నేకత్వాభిమానము అస్మిత. అదియునిట్లు చెప్పఁబడినది. "దృగ్దర్శన శక్త్యోరేకాత్మతే వాస్మితా" (పాతం.యో.సూ 2.6.) దృక్దృశ్య శక్తిని పరస్పరైకత్వా ధ్యాసముఃఅస్మిత.

సుఖాభిజ్ఞునికి సుఖాను స్మృతి పూర్వకమై సుఖసాధనములందు తృష్ణా రూపమైన గంధము రాగము. దుఃఖాభిజ్ఞునికి తదనుస్మృతి పురఃస్సరమైన తత్సాధనముఃలందు నివృత్తి ద్వేషము. అది యిట్లు చెప్పఁబడినది.

సుఖాను శయీ రాగః (పాత.2.2.)
దుఃఖానుశయీ ద్వేషః (పాత.యో.18 )

సుఖ విషయకమగు క్లేశము రాగము దుఃఖ విషయకమగు యా క్రోధము ద్వేషము అని.

ఇక్కడ అనుశయ శబ్దమునకు తాచ్ఛీల్యార్థమందు ణిని, గాని ఇని గాని మత్వర్థ ప్రత్యయము గాని చెప్పుట యిష్టమా? ణిని చెప్పరాదు. "సుప్యపి అజాతౌ జాతౌ ణినిస్తాచ్ఛీల్యే (పాణి.సూ. 3.2.78.)

అనుచోట సుపి అని యుండఁగా మరల సుప్‌ను గ్రహించుట ఉప సర్గమును నివర్తింపఁ జేయుటయే ఫలముగాఁ గలది గనుక 'సోపసర్గయగు ధాతువు నుండి ణిని కలుగదు. ఏదోలాగున దానిని అంగీకరించినను గూడ అచోఽక్షణి (పాణి.సూ. 6.2,115) అను సూత్రముచే వృద్ధి ప్రసక్తముకాఁగా అతి శాయ్యాది పదములవలె అనుశాయి పదమును గూడ ప్రయోగింపవలసి వచ్చును. ఇంక రెండవదియును గాదు.

"ఏకాక్షరా త్కృతో జాతేః స ప్తమ్యాంచ

న తౌస్మృతౌ "ఏకాక్షర శబ్దము కంటె కృత్తునకు జాతి వాక్యార్థమునకు సప్తమ్యర్థమునందు ఇన్‌ఠన్ లురావు. ఇక్కడ అనుశయ శబ్దము అజంతము గాన కృదంతము. కనుక అనుశయ శబ్దమును ఉపపాదింప శక్యము గాదు అన్నచో భావము అవబోధము గాదు గాన ఇది భద్రమైనది గాదు. ప్రాయికాభిప్రాయమైనది యీ వచనము. కనుకనే వృత్తికారునిచే నిట్లు చెప్పఁబడినది. "ఇతి కంణో వివక్షార్థః సర్వత్రాభి సంబధ్యతే" అని.

కనుక ఒకప్పుడు కార్యి అని కార్యికుఁడని తండులీ అని తండులికుఁడని ఆగును. కనుక కృదంతము కంటె జాతికి ప్రతిషేధము ప్రాయికము. అనుశయ శబ్దము కృదంత మగుట చేతనే ఉపపన్న నుగుచున్నది కాన ఇని సిద్ధించినది.

పూర్వ జన్మమందనుభవించిన మరణ దుఃఖానుభవ వాసనా బలము వల్ల ప్రాణి మాత్రముల కన్నిటికి పురుగు మొదలు పండితుని వఱకు పుట్టిన శరీర విషయాదులకును నాకును వియోగము గలుగక పోవుఁగాక అని నిమి

త్తము లేకుండనె ప్రవర్తించు భయరూపమైన యభినివేశము అయిదవదైన క్లేశము. ఇది వఱకు లేను. ఇంకముందు కాకుందును గాక అను ప్రార్థన ప్రతి యాత్మకు అనుభవ సిద్ధమే అదే యిట్లు చెప్పబడినది —

స్వరసవాహీ విదుషోఽపి తథా రూఢోఽభినివేశః

(పాత. యో. సూ. 2.9.)

స్వరసేన = సంస్కార సూత్రేణ వాహీ = స్వాభావిక = విద్యావంతునికి గూడ అట్లు అభినివేశము స్వాభావికమై రూఢమైనది. ఆ యవిద్యాదులు అయిదును సాంసారిక వివిధ దుఃఖోపకార హేతువులయి పురుషునికి క్లేశము కలిగించుచున్నవి. కాన క్లేశములు అవి ప్రసిద్ధములు.

కర్మలు విధివర్తి భేదరూపములు. విహితము జ్యోతిష్టోమము. ప్రతిషిద్ధము బ్రహ్మహత్యాదులు. విపాకములు కర్మఫలములు. జన్మ ఆయువు భోగములు. ఫలము ఫలించువఱకు చిత్తభూమిలో శయనించి యుండునవి గనుక ఆశయములనఁబడెను. అవి ధర్మాధర్మ సంస్కారములు. వానికి శత్రువులైన చిత్తవృత్తులను నిరోధించుట యోగము. నిరోధమనఁగా అభావమంతయు అభిమతము గాదు. అట్లన్నచో అది తుచ్ఛముగాని భావరూపమైన సాక్షాత్కారమును పుట్టించుటకు సమర్థమై యుండుట అసంభవమగును. కాన దానిని ఆశ్రయించిన మధుమతి మధు ప్రతీకము విశోకము సంస్కార శేషములచే వ్యపదేశింపదగిన చిత్తావస్థా విశేషము. అపుడే దీనియందు ప్రమాణ ప్రమేయాది చిత్తవృత్తులు నిరోధింపఁబడునను వ్యుత్పత్తి యుపపన్నమగుచున్నది.

"అభ్యాస వైరాగ్యములచే వృత్తిని నిరోధింపవలెను. ఆ స్థితియందలి యత్నము అభ్యాసము (పాత. యో. i. 12. 13.) వృత్తులు పోయిన చిత్తమునకు స్వస్వరూపమందున్న ప్రశాంతవాహిత రూపమై పరిణామ విశేషము స్థితి. దానిని నిమిత్తముగాఁ జేసికొని యత్నము చేయుట అనఁగా మాటిమాటికి అట్లు చేతస్సునందు నించుట అభ్యాసము. "చర్మ నిమిత్తము పెద్దపులిని జంపుచున్నాఁడు" అను దానివలె ఈ సప్తమి నిమిత్తమును నర్థము చెప్పునది అని చెప్పఁబడినట్లయినది.

దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యం" (పాతం. యో. సూ. 1. I. 5.) ఐహిక పారలౌకిక విషయాదులందు దోషము కనిపించుట వలన అభిలాష లేని నాకు ఈ విషయములు వశ్యములు నేను వీనికి వశుఁడను గాను అని విమర్శ వైరాగ్యమని చెప్పఁబడినట్లయినది. సమాధికి శత్రువులయిన క్లేశములను క్షీణింపఁజేయుటకును సమాధి లభించుటకును మొదట యోగి క్రియా యోగపరుఁడై యుండవలయును. క్రియా యోగమును సంపాదించినచో అభ్యాస వైరాగ్యములు సంభవించును. అది శ్రీ కృష్ణ భగవానుఁడిట్లు చెప్పెను.

"ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే
(భగవద్గీత. 6. 3.)

ఆ క్రియా యోగము పతంజలిచే నుపదేశింపఁబడినది. "తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియా యోగః (పాతం యో. 2. 1.) తపస్సు మోక్ష శాస్త్రాధ్యయనము, ఈశ్వర ధ్యానము అమనవి క్రియా యోగములు అని. తపస్సు అనఁగా నేమిటో యాజ్ఞవల్క్యుఁడు నిరూపించెను.

"విధినోక్తేవ మార్గేణ కృచ్ఛ్ర చాంద్రాయణాదిభిః
శరీరశోషణం ప్రాహు స్తవసాంతప ఉత్తమం" ఇతి శాస్త్రోక్తమార్గము ద్వారా కాని క్రచ్ఛచాంద్రాయణ వ్రతాదులచే గాని శరీరము నుశుష్కింపఁ జేయుటయె తపస్సులలోనికెల్ల ఉత్తమ తపస్సు" అని.

ప్రణవ గాయత్రీ ప్రభృతులను చదువుట స్వాధ్యాయము. ఆ మంత్రములును రెండు విధములు. వైదికములు తాంత్రికములును అని. వైదికములు ప్రగీతములు అప్రగీతములు అని రెండు విధములు. అందు ప్రగీతములు సామములు. అప్రణీతములును ఛందో బద్ధములును తద్విలక్షణములు అని రెండు విధములు. అందు మొదటివి ఋక్కులు. రెండవవి యజస్సులు. "తేషామృగ్యత్రార్థ వశేన పాద వ్యవస్థా, గీతిషు సామాఖ్యా. శేషే యజుః శబ్దః" (జై. సూ. 2. 1. 33, 35) అని. ఎందు అర్థమును బ.

పాదవ్యవస్థ ఏర్పడునో అది ఋక్కు, గీతులకు సామలని పేరు. మిగిలినవి యజుశ్శబ్ద వాచ్యములు అని. కామసంబంధ కారణ ప్రపంచాద్యాగమము లయిన తంత్రములందు వర్ణింపఁబడినవి తాంత్రికములు. ఆ మంత్రములను స్త్రీ పుంనపుంసక భేదమును బట్టి మూఁడు విధములు. అదే చెప్పఁబడినది —

"స్త్రీ పుం నపుంసక త్వేన త్రివిధా మంత్ర జాతయః
స్త్రీ మంత్రా వహ్నిజాయాంతా నమోంతా స్స్యు ర్నపుంసకాః
శేషాః పుమాంస స్తే శస్తాః సిద్ధా వశ్యాది కర్మణి"

మంత్రములన్నియు స్త్రీ మంత్రములు, పురుష మంత్రములు, నపుంసక మంత్రములని మూఁడు విధములు. స్వాహా అను పదము చివర గలవి స్త్రీ మంత్రములు. నమః అనుపది చివర గలవి నపుంసక మంత్రములు, మిగిలినవి పురుష మంత్రములు. అవి వశ్యాది కర్మలయందు సిద్ధములై యుండును" అని.

జననాది సంస్కారములు లేకపోయినను సమస్త దోషముల నిరసించుటచే సిద్ధి హేతువు అగును. కాని సిద్ధత్వము కలుగును. ఆ సంస్కారమును శారదా తిలకమందు దశవిధమని చెప్పఁబడినది.

"మంత్రములలో సిద్ధిని ఇచ్చు మంత్రములు పది. ఆ మంత్రములు చక్కఁగా సంస్కరింపఁబడినవై శీఘ్రముగా నిర్దోషములగును. జననము, జీవనము, తాడనము, బోధనము, అభిషేకము, విమలీకరణము, ఆప్యాయనము, తర్పణము, దీపనము, గుప్తి అను పది మంత్ర సంస్కారములు. మాతృకా యంత్రము నుండి మంత్రముల నుద్ధరించుట జననము. ప్రణవము మధ్యను గూర్చి మంత్ర వర్ణములను పండితుడు జపింపవలయును. మంత్ర వర్ణ సంఖ్యచే ఆ జపమును జీవనమందురు. మంత్ర వర్ణములను వ్రాసి మంచి గంధపు నీటిచే కోటి వాయు బీజము (=యం) లచే ప్రత్యేకముగా అకట్టుటనే తాడనమందురు. మంత్ర వర్ణములను అయితే వ్రాసి మంత్ర వర్ణములచే లెక్కించఁబడిన కరవీర పుష్పములచే కొట్టవలయును అది బోధనము. మంత్రించువాఁడు స్వతంత్రోక్త విధానముచే మంత్రవర్ణ

సంఖ్యచే రావి చిగుళ్ళతో మంత్రమును విశుద్ధికై అభిషేకింపవలయును, అది అభిషేకము. మనస్సుతో మంత్రమును ధ్యానించి మంత్రించువాఁడు జ్యోతిర్మంత్రముచే మంత్రమునందు మలత్రయమును (1 మాయికము 2 కార్మణము 3 ఆనవ్యం=నవ; అవత=ఆనప్య=ఆనపత్య=వృద్ధత్వము) నిర్ద హింపవలయును, అది విమలీకరణము. ప్రణవము, హకారము, రేఫము,= ఔలతో గూడినది జ్యోతిర్మంత్రము. జపించిన కుశోదకముచే పఠివర్ణమును వారి బీజము (=వం) చే యథావిధిగా మనువు (మంత్రము) యొక్క ప్రోక్ష ణము అప్యాయనము. మంత్రజలముచే మంత్రమందు తర్పణము తర్పణము. మనువుయొక్క తారమాయా (=ప్రణవ) (బీజం=హ్రీం) రమా (శ్రీ)యోగము దీపనము. జపింపఁబడు మంత్రములను ప్రకాశింపజేయకపోవుట గుప్తి సర్వ తంత్రములందు మంత్రములకు పది సంస్కారములు గుప్తము చేయఁబడి నవి. దానిని సంప్రదాయ ప్రకారముగా చేసినచో మాంత్రికుఁడు తన వాం ఛితములను పొందును. ఈ యుత్తమ సంస్కారములచేత (= లం లం) రుద్ధ మంత్ర కీలిత మంత్ర విచ్ఛిన్నమంత్ర సుప్తమంత్ర శప్తాదులైన మంత్ర దోషములు నశించును" అని. అకాండ తాండవముతో సమానమైన ఈ మంత్ర శాస్త్ర రహస్యములను ఉద్ఘోషించుట ఇంతతో చాలింతము.

ఈశ్వర ప్రణిధానమనఁగా చెప్పఁబడినట్టియు చెప్పఁబడనట్టియు సద్ క్రియలను పరమగురువైన పరమేశ్వరునికి సమర్పించుటయె. అది యిట్లు చెప్పఁబడినది —

"కామతోఽకామతో వాపి యత్కరోమి శుభాశుభం
తత్సర్వం త్వయి విన్యస్తం త్వత్ప్రయుక్తః కరోమ్యహం".

"కోరిగాని, కోరకగాని శుభాశుభమునేమేమి చేయుచున్నానో అవియన్నియు నీకే అర్పింతును. నీచే ప్రయుక్తుఁడనై నేను జేయుచున్నాను". అని.

క్రియాఫల సంన్యాసము గూడ భక్తి విశేషమను మారుపేరు గల ధ్యానమె. ఫలాభిసంధానము కర్మ చేయుటవలన. అట్లును గీతలో భగ వంతునిచే గానము చేయఁబడినది —

కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మ ఫల హేతుర్భూ ర్మాతే సంగోఽస్త్వ కర్మణి"
(2. 4. 7.)

ఫలాభిసంధికి ఉపఘాతకత్వము భగవానులైన నీలకంఠ భారతీ శ్రీ చరణులచే చెప్పఁబడినది.

"అపి ప్రయత్న సంపన్నం కామేనోపహతం తపః
నతుష్టయే మహేశస్య శ్వలీఢ మివ పాయసం"

ప్రయత్నముచే సంపన్నమైనను తపస్సు కామముతోఁ గూడియున్నచో కుక్క ముట్టుకొన్న పాయసము వలె మహేశునికి తుష్టిని గూర్చదు.

తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానరూపమైన క్రియ యోగసాధనమగును గాన యోగమనుచోట సారోప లక్షణావృత్తి నాశ్రయించుటచే ఆయుస్సు నేయి అన్నట్లు యోగసాధనము నిరూపింపఁబడుచున్నవి. శుద్ధ సారోపలక్షణ అనఁగా లక్షణలో ఒక రకము. అది కావ్య ప్రకాశములో నిరూపింపఁబడినది.

ముఖ్యార్థబాధనుబట్టి దానికి సంబంధించిన దానినిబట్టి అర్థాంతరమును జెప్పుట లక్షణ (దీని వివరము నా 'సాహిత్య సౌందర్య దర్శనము' లో మాడుడు).

ఆ యోగము యమ నియమాది భేదములచే ఎనిమిది విధములుగా నిర్దేశింపఁబడినది.

బ్రహ్మచర్య మహింసాం చ సత్యాఽస్తే యాఽపరిగ్రహాన్
సేవేత యోగీ నిష్కామో యోగ్యతాం స్వం మనోనయన్
స్వాధ్యాయ శౌచ సంతోషతపాంసి నియతాత్మనాం
కుర్వీత బ్రహ్మణి తథా పరస్మిన్ ప్రవణం మనః

ఇందు అహింసాదులు యమములు. 1 అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, యమములు (చూ. నా యోగతత్త్వ దర్శనము. 2 30) అని పతంజలి. శౌచాదులు నియమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ధ్యానము అనునవి నియమములు.

ఈ యమ నియమములు విష్ణు పురాణములోఁ జెప్పఁబడెను. వి. పు. 6-7 36-38

స్థిరమై సుఖమైనది యాసనము.

1 పద్మాసనము 2 భద్రాసనము 3 వీరాసనము 4 స్వస్తికాసనము 5 ( కాసనము 6 సోపాశ్రయము 7 పర్యంకము 8 క్రౌంచము నిషదనము 9 ఉ నిషదనము సమ సంస్థానము అను భేదములను బట్టి ఆ యాసనము పది ములు. ఇవి యన్నియు యాజ్ఞవల్క్యునిచే నిరూపింపఁబడినవి ఆ యా స్థైర్యము కలుగఁగా ప్రాణాయామము ప్రతిష్ఠింపఁబడును. అది శ్వా ప్రశ్వాసముల గతి విచ్ఛేద రూపమై యుండును. అందు శ్వాస మన లోనికి గాలిని పీల్చుట. ప్రశ్వాసమనఁగా లోని గాలిని వెలికి విడుచుట. రెండిటి సంచారము లేకపోవుట ప్రాణాయామము. మరి యిది ప్రాణాయ సామాన్య లక్షణము గాదు. ప్రాణాయామ విశేషములయిన రేచక పూ కుంభక ప్రకారములందు అది అనుగతమగుట కుదురకపోవుటవలన అన్న అది దోషము గాదు. అన్నిచోట్ల శ్వాస ప్రశ్వాసాదుల గతి విచ్ఛేదమ సంభవించుచున్నవి గదా. అదెట్లన, లోని వాయువు వెలికి విడుచుట రే రూప ప్రాణాయామము అది ప్రశ్వాసమని చెప్పఁబడినది. వెలుపలి వాయ లోన ధరించుట పూరకము అదే శ్వాసము. లోన నిలిపియుంచుట కు కము. దానియందు కుంభమందు జలమువలె నిశ్చలముగా ప్రాణవాయు నిలిపి యుంచఁబడును— దానిలో అంతట శ్వాస ప్రశ్వాసల గతి విచ్ఛేద లున్నవి గాన శంకకు అవకాశమే లేదు. అదే యిట్లు చెప్పఁబడినది "అది యుండఁగా శ్వాస ప్రశ్వాసల గతి ప్రాణాయామము. (పాతం. యో సూ. 2. 49.) అని.

ఆ వాయువును సూర్యోదయము మొదలు రెండున్నర గడియ ఘటీ యంత్రము భ్రమించునట్టి ఒక్కొక్క నాడియందు ఉండును. విధముగా రాత్రింబవళ్ళు శ్వాస ప్రశ్వాసలు ఇరవది యొక్క వేల అరు దలు పుట్టును. కనుకనే మంత్ర సమర్పణ రహస్యము తెలిసినవారిచే అజ మంత్ర సమర్పణములో ఇట్లు చెప్పఁబడెను.

"గణేశునికి ఆఱు వందలు, స్వయంభువునికి ఆఱు వేలు, విష్ణువునకు ఆఱు వేలు, పిసాకికి ఆఱు వేలు, గురువునకు ఒక వేయి, పరమాత్మకు ఒక వేయి, ఆత్మకు ఒక పేయి, శ్వాసలతో చేసిన జపమును సమర్పింతును" అని.

అట్లే నాడీ సంచార దశయందు వాయు సంచారములో పృథి వ్యాది తత్త్వములు వర్ణ విశేషవశము వలనఁ బురుషార్థమును కోరు పురుషులు తెలిసికొనవలయును. అది యిట్లు అభియుక్తులచేఁ జెప్పఁబడినది.

ఇడా పింగళల మధ్య ఒక్కొక్క నాడితో రెండున్నర గడియలదాక ప్రాణవాయువు సంచరించును. తిరుగలి వలె మాటిమాటికి సూర్యోదయము మొదలు ఈ రెండు నాడులు క్రమముగా వహించును. ఆ రెండున్నర గడియలలో 9 వందల శ్వాస ప్రశ్వాసలు అగును. మొత్తం ఇట్లు 21600 శ్వాసలగును.

"శ్వాసలను వహించు రెండు నాడులందు ప్రత్యేకముగా అయిదు తత్త్వములు రాత్రిఁబవళ్ళు వహించుచున్నవి. వానిని నియుతాత్ములు తెలిసికొనవలసినవి. పైకి అగ్ని, క్రిందికి నీరు, అడ్డముగా గాలి సగము పుటమున భూమి ఆకాశము అంతటను వహించును. వాయువుయొక్క, వహ్నియొక్క, జలముల యొక్క, భూమి యొక్క, ఆకాశము యొక్క తత్త్వమును క్రమముగా వహించును. అట్లు వహించు నాడుల ఈ క్రమము ఎల్లపుడు తెలియఁదగును. భూమికి ఏబది ఫలములు, నీళ్ళకు నలభై ఫలములు, అగ్నికి ముప్పై ఫలములు, గాలికి ఇరవై, ఆకాశమునకు పది. ఇది ప్రవహించు కాలపు సంఖ్య. అందు హేతువిదిగో చెప్పఁబడుచున్నది. భూమి అయిదు గుణములు గలది. నీళ్ళు నాలుగు గుణములు గలది. అగ్ని మూడు గుణములు గలది. గాలి రెండు గుణములు గలది. ఆకాశము ఒక్క గుణము గలది. గుణమును గూర్చి పది ఫలములుండును. అందువలన భూమికి ఏబయి గుణములు. భూమికి అయిదు గుణములు జలాదు కొక్కొక్క గుణము తగ్గిపోవును. గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము అను గుణములు భూమి గుణములు. భూతత్త్వముచే కార్యమందు

శాంతి, జలముచే కార్యమందు ఫలోన్నతి, తేజస్సున దీప్తి వాయువున ఆ
తత్వము, ఆకాశమందు వ్యూహవృత్తి ఉండును. భూమి చిహ్నము స్వచి
స్థైర్యము, తేజస్సుకు శైత్యమున కామోత్పత్తి, మరుత్తునకు కోపతాపము
ఆకాశమునకు శూన్యత్వము లేక అధర్మవాసన ఇవి చిహ్నములు, చెవులం
బొటన వ్రేళ్ళు ఉంచిన భూమితత్త్వము, జ్ఞానము, ముక్కులు రెండిటియం
మధ్య వ్రేళ్ళు ఉంచిన జలతత్త్వ జ్ఞానము, చెలువు (సృక్విణి) లందు దగ్గ
చివరివేళ్ళు ఉంచిన తేజస్తత్వ జ్ఞానము, దృగంతములందు మిగిలిన వ్రేళ్ళు
చిన మిగిలినవాని జ్ఞానము గలుగును. భూమి పీతము, జలము తెలుప
తేజస్సు ఎఱుపు, వాయువు శ్యామము, ఆకాశము నిరూపాధిగాను ఉండు
అని.

సరిగా వాయుతత్త్వ జ్ఞానమును తెలిసికొని దానిని నియమించిన
వివేక జ్ఞానమునకు ఆవరణమైన కర్మ క్షయించును. ప్రాణాయామముకం
వేఱు తపస్సు లేదు.

దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం యథామలాః
ప్రాణాయామైస్తు దహ్యంతే తద్వదింద్రియజా మలాః

"అగ్నితో కూడినవై ధాతుమలము లెట్లు దహింపఁబడునో అట్లే ప్రాణాయామ
ములచే నింద్రియజన్య మలములు దహింపఁబడును" అని.

ఇట్లు యమాదులచే సంస్కరింపఁబడిన మనస్సు గల యోగికి సంయ
మము కొఱకు ప్రత్యాహారము చేయవలయును. చక్షురాదీంద్రియములు వి
యముల నుండి వ్యతిరేకముగా దీనియందు లాగఁబడును (ప్రతీపం ఆహ్రి
యంతే) గాన ప్రత్యాహారము అను వ్యుత్పత్తిని బట్టి ఎల్లపుడు అనురం
నీయ, కోపనీయ, మోహనీయ ప్రవణత్వమును విడిపించుటచే అవికృతమైన
స్వరూపమందు ప్రవణమైన చిత్తమును అనుకరించుట ప్రత్యాహారము
కనుక చిత్తానుకారమెట్లు? అవును నిజమె. కనుకనె వాస్తవమునకు అది
అసంభవము అని చెప్పి సాదృశ్యార్థకమైన ఇవ (వలె) శబ్దమును సూత్ర
కారుఁడు చెప్పెను.

"సూ. స్వవిషయా సంప్రయోగే చిత్త స్వరూపాను కార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః (పా. యో. సూ. 2. 54)అని.

సాదృశ్యమనఁగా చిత్తానుకారమునకు నిమిత్తమైన విషయాఽసంప్రయోగము. ఎప్పుడు చిత్తము నిరోధింపఁబడునో అపుడు చక్షురాదుల నిరోధించుటలో వేఱె ప్రయత్నమును అపేక్షింపనక్కరలేదు. మధుకర రాజ్ఞిని మధు మక్షికలు అనుసరించునట్లు ఇంద్రియములు చిత్తమును అనుసరించును. అది విష్ణు పురాణములో నిట్లు చెప్పఁబడెను.

"శబ్దాదులందు ప్రసక్తములైన యక్షరములను నిగ్రహించి యోగవేత్త ప్రత్యాహార పరాయణుఁడై చిత్తమునను కరించువానినిగాఁ జేయవలయును. దానిచే అతిచంచల స్వభావముగల యింద్రియములు మిక్కిలి వశ్యములగును. ఆ యింద్రియములు వశ్యములు గానిచో యోగి సాధకుఁడు కానేరఁడు" అని.

నాభిచక్ర హృదయ పద్మనాసాగ్రాదులైన యాధ్యాత్మిక ప్రదేశములందుగాని హిరణ్యగర్భ వాసవ ప్రజాపతి ప్రభృతుల గల బాహ్యదేశమందుఁగాని చిత్తమును ఇతర విషయములను పరిహరించి స్థిరపఱచుట ధారణ. అదే యిట్లు యోగదర్శనమందు చెప్పఁబడినది.

దేశ బంధః చిత్తస్య ధారణా (పాతం.యో. సూ. 3.1.) పౌరాణికులు గూడ-

ప్రాణాయామేన పవనం ప్రత్యాహారేణచేంద్రియాన్
వశీకృత్య తతః కుర్యాచ్చిత్త స్థానం శుభాశ్రయే
(విష్ణు.పు. 6.7.45.)

ఆయా ప్రదేశములలో ధ్యేయమునకు గల ఆధారమైన జ్ఞానము విసదృశ జ్ఞానమును విడచుట ద్వారా ప్రవాహ రూపముగా నుండుట ధ్యానము.

అందు ప్రత్యయై కతానా ధ్యానమ్ (పాతం. 3.2.) అని యోగదర్శనము. ఇతరులును ఇట్లు చెప్పిరి.

"తద్రూప ప్రత్యయైకాగ్ర్యా సంతతిశ్చాన్య నిఃస్పృహా
తద్ధ్యానం ప్రథమై రంగై షడ్భి ర్నిష్పాద్యతే నృప.
(విష్ణు.పు. 6.6.80.) అని.

ప్రసంగమును బట్టి చివరి యంగము (సమాధి) ఇది వరకే నిరూపించ బడినది.

కనుక ఆదర నైరంతర్య దీర్ఘకాలము సేవించఁబడిన యోగానుష్ఠానము చేత సమాధికి విరుద్ధమైన క్లేశములు క్షయింపఁగా అభ్యాస వైరాగ్య వశము వలన మధు మత్యాది సిద్ధులు లభించును.

అందు మధుమతి అనఁగా అభ్యాస వైరాగ్య వశము వలన రజస్తమో లేశములు నశింపఁగా సుఖ ప్రకార రూప సత్త్వమును భావించుటచే శుద్ధము యిన బుద్ధి చాతుర్యము ప్రకాశించుట రూపమైన ఋతంభర ప్రజ్ఞ అను సమాధిసిద్ధి గలుగును.
"ఋతంభరాతత్ర ప్రజ్ఞా (పాతం సూ. 1.48.) అని-

ఋతమనఁగా సత్యము దానిని భరించునది ఒకప్పుడును విపర్యయముచే ఆచ్ఛాదింపఁబడదు. అందుస్థితి దార్ఢ్యము కాఁగా రెండవ యోగికి ఆ ప్రజ్ఞ కలుగునని భావము. యోగులు నలుగురు ప్రసిద్ధులు. 1. ప్రాథమిక కల్పికుఁడు 2. మధు భూమికుఁడు 3. ప్రజ్ఞాజ్యోతి 4. అతిక్రాంత భావనీయుఁడు అని. అందు అభ్యాసము గలిగి ప్రవర్తించిన జ్యోతి గలవాఁడు మొదటివాఁడు. వీనిచే పర చిత్తాదులను తెలిసికొను జ్ఞానము గల జ్యోతి వశము చేసికొనఁబడునని చెప్పఁబడినట్లు అగును. ఋతంభర ప్రజ్ఞుడు రెండవవాఁడు. భూతములను ఇంద్రియములను జయించిన వాఁడు మూడవ పరవైరాగ్యముతోఁ గూడినవాఁడు నాల్గవ వాఁడు. మనోజవిత్వాదులు మధు ప్రతీక సిద్ధులు. మనోజవిత్వం వికరణ భావః ప్రధాన జయశ్చ (పాతం. సూ. 3.88:) అని యోగ సూత్రము. మనోజవిత్వ మనఁగా శరీరమునకు మనోవేగము గలుగుట. వికరణ భావమనఁగా కాయమును అపేక్షింపని

యింద్రియములు తమకిష్టమైన దేశకాల విషయములను అపేక్షించి వర్తించుట. ప్రధాన జయమనఁగా ప్రకృతి వికారము లన్నిటియందు ఇంద్రియములు వశమై యుండుట. ఈ సిద్ధులు, పంచేంద్రియ రూపములనుజయించుట వలన మూఁడవ రకమైన యోగికి ప్రాదుర్భవించెను. తేనెలోని యొకింత భాగము వలె కూడ ఆస్వాద యోగ్యమగును గాన మధుప్రతీకములనఁ బడెను. సర్వ భావములకు అధిష్ఠాత గానగుట రూపమైనది విశోక సిద్ధి.

> సత్త్వ పురుషాన్యతా ఖ్యాతి మాత్రస్య సర్వ భావాధి
> ష్ఠాతృత్వం సర్వజ్ఞత్వం చ (పాతం. సూ. 3.48.)
> (అని యోగ సూత్రము.)

సత్త్వ పురుషుల భేదసాక్షాత్కారమె ప్రతిష్ఠగాఁ గలవానికి సర్వభావాధిష్ఠాత్వమును (యధేచ్ఛా భావి వినియోగమును) సర్వజ్ఞత్వమును గలుగును.
వ్యవసాయాత్మక (ప్రకాశ విషయరూప)మైన ఇంద్రియ విషయములును శబ్ద స్పర్శాది జడములును అవ్యవసాయాత్మక పృథివ్యాది రూపములును గుణ పరిణామ రూపములును అగు భావములను ప్రభువు వలెను ఆక్రమించుటయె సర్వభావాధి ష్ఠాదృత్వము. శాంతోదిత భావములచే వ్యవదేశింపరాక ధర్ములుగానున్నట్టి వాని వివేకమె సర్వజ్ఞాతృత్వము.

> "విశోకావా జ్యోతిష్మతీ. (యోగ.సూ. 1.36. అని యొగ సూత్రము.
> సర్వవృత్తులు ఉపసమించుట రూపమైన పరవైరాగ్యమును ఆశ్రయించి

జాత్యాది బీజరూపములైన క్లేశములకు నిరోధించుటకు సమర్థమైన నిర్బీజమైన సమాధి. అసం ప్రజ్ఞాతమను పేరు గలదై సంస్కార శేషమని వ్యపదేశింపఁబడిన చిత్తావస్థా విశేషము. "విరామ ప్రత్యయాభ్యాస పూర్వః సంస్కార శేషోఽన్యః (పాతం.యొ. 1.18.) అని యోగ సూత్రము. ఇట్లును అన్ని విషయముల నుండి విరక్తి పొందిన ఆ పురుషశ్రేష్ఠుని క్లేశబీజములు తగులఁ బెట్టబడిన వరిగింజ వంటివై తిరిగి మొలచు సామర్థ్యము లేనివై మనస్సుతో పాటే అస్తమించును.

మఱి యిది యిట్లు ఇవి ప్రలయమును పొందఁగా అడ్డులేని వివేకఖ్యాతి యొక్క పరిపాక వశము వలన కార్యకారణ రూపములు ప్రధానమందు లయించుటయె గాని స్వరూపమందు నిలుకడ గలిగి మరల బుద్ధి సత్త్వాది సంబంధము లేనిదై వ చైతన్య శక్తిగాని కైవల్యమును పొందునని సిద్ధించినది. ఈ రెండు విధములైన ముక్తి పతంజలిచే

"పురుషార్థ శూన్యానాం గుణానాం ప్రతిప్రసవః
కైవల్యం స్వరూప ప్రతిష్ఠా వా చితిశక్తిః"

(ప్రతి ప్రసవః= స్వకారణమందు అత్యంతములయించుట) యోగ.సూ. 1.3.1) అని చెప్పఁబడినది.

ఈ స్థితి కలిగియున్నను జీవుఁడు ఎందువలన మరల పుట్టఁడు అని అడుగరాదు ఏలయన, కారణము లేనిదే కార్యము పుట్టదు" అను న్యాయమును బట్టి ప్రమాణముచే సిద్ధమైన విషయములలో నియోగాను యోగములు సంభవించవు గనుక. అట్లుగాక కారణము లేకపోయినను కార్యము సంభవించినచో మణివేధాదులు (మణికి చిల్లు పొడచుట) అంధాదుల వలనఁ గలిగియుండెడివి. అట్లును శ్రుతి గలదు. "అంధో మణి మవిందత్, తమనంగుళి రావయత్, అగ్రీవః ప్రత్యముంచత్ త మజిహ్వా అసశ్చత (తై.ఆ 1-.11.5) అంధుఁడు మణిని వేధ చేసెను. దానిని వ్రేళ్ళు లేకయె పట్టుకొనెను. మెడ లేనివాడై ధరించెను. నాలుక లేకయె స్తుతించెను." అని

ఇంక నిట్లు చికిత్సా శాస్త్రము వలె యోగశాస్త్రమును నాలుగు వ్యూహములు గలది. చికిత్సా శాస్త్రములో రోగము, రోగ హేతువు, ఆరోగ్యము, ఔషధములను నాలుగు విషయములున్నట్లే ఇందును సంసారము సంసార హేతువు మోక్షము మోక్షోపాయము అను నాలుగు విషయములు గలవు. అందు దుఃఖమయమైన సంసారము హేయము, ప్రధాన పురుషుల సంయోగము హేయమైన భోగములకు హేతువు. దాని యత్యంత నివృత్తి హానము. దాని యుపాయము సమ్యగ్దర్శనము అని. ఇట్లు ఇతర శాస్త్రములతోఁ గూడ వీలును బట్టి నాలుగు వ్యూహములు ఊహింపఁదగినవి. ఇట్లు అంతయుశుద్ధము.

ఇది పాతంజల దర్శనము.

## శంకరాచార్యుల జీవితము

ఇతఁడు క్రీస్తుశకము 788 సం॥లో కేరళ రాష్ట్రములోని కాలటి యను గ్రామమున ఆర్యాంబ, శివగురువు అను నంబూద్రి బ్రాహ్మణ దంపతులకు వైశాఖ శుద్ధపంచమినాఁడు జనించెను. శంకరుని మూఁడవ యేటనే తండ్రి శివగురువు పరమపదించెను. పిదప అయిదవ యేట నితనికి తల్లి యుపనయనము గావించెను. క్రమముగా అతఁడు గురువులదగ్గఱ సకల శాస్త్రము లను పఠించెను. వేదాధ్యయనము గావించెను. దర్శనములను జూచెను. ఇతిహాస పురాణస్మృతులను పర్యాలోచన చేసెను.

పిదప గురుకులము నుండి గురువునసుజ్ఞ పొంది యింటికి వచ్చి తల్లికి సేవ చేయుచుండెను. యుక్తవయస్కుడైనను అతనికి సంసారమునందు దృష్టి లేకుండెను అతడు "సన్యసించి దేశమున సంచారము చేసి జ్ఞానమును ప్రచారము చేయుచు దుష్టమతములను ఖండింపవలె"నని దలచెను అప్పటికి జనులు జ్ఞానకాండమునందుగాక కర్మకాండయందె యెక్కువ శ్రద్ధ గలవారుగ నుండిరి నాస్తిక మతములు ప్రబలుచుండెను. ఇట్టి స్థితిలో అతఁడు ఒక గురువుదగ్గఱ సంన్యాసదీక్ష గ్రహింపదలచెను. కాని ఏకపుత్త్రయగు తల్లి యంగీకరింపదయ్యెను. అయినను శంకరునికి సంసారమునందు ఏమాత్రము దృష్టిపడలేదు. ఆర్యాంబ కర్మకాండయందు ఎక్కువ నమ్మకముగలది. కొడుకు సంన్యసించినచో తనకు అంత్యక్రియయి జరుపువారు ఉండరనికూడ అమె శంకరుని సంన్యాసదీక్షకు అంగీకరించలేకుండెను. ఇది గ్రహించి శంకరుడు తానేస్థితిలో నున్నను తల్లికి అంత్యక్రియలు జరపెదనని వాగ్దానమిచ్చెను. అయినను తల్లి కొడుకు దీక్షకు ఏమాత్రము అంగీకరింపలేదు. తల్లి యంగీకారమున్నగాని దీక్ష గ్రహించుటకు వీలులేదు.

ఇట్లుండ ఒకనాడు శంకరుడు తల్లితోగూడ స్నానమునకు ఒక నదికి పోయి స్నానము చేయుచుండెను. తల్లి గట్టుపైని కూర్చుండి యుండెను. ఇంతలో శంకరుని కాలిని ఏదో పట్టుకొన్నట్లు తోచెను. చివరకు సంన్యాసము పుచ్చుకొని బంధముక్తి పొంది శరీరము విడువవలయునన్న యాశతోనున్న

శంకరుడు 'అమ్మా? నన్ను మొసలి పట్టుకొన్నట్లున్నది. నాకు సన్న్యాసము నకు అనుజ్ఞయిమ్ము. సన్న్యాసినయితినను సంతృప్తితోనైనను చనిపోదును' అనెను. ఇంక కొడుకు ఇట్టి స్థితిలో బ్రతుకునను నాశ తల్లికి లేకపోయెను. రక్షించుటకు దగ్గర ఎవరునులేరు. విధిలేక కుమారుని చివరికోర్కె యయినను తీర్చుదమని "సరే" అనెను. ఇంతలో అక్కడ ఏదియులేక భ్రాంతిమాత్రమె యుండుటచే అతఁడు సురక్షితముగా పైకివచ్చెను. భ్రాంతియెగదా మాయ. అదే అన్నిటిని చేయించును. పిదప ఇట్టి భ్రాంతిని బోగొట్టుటకే శంకరుడు ప్రయత్నము చేసెను.

చనిపోవునేమోయని దిగాలు పడియున్న తల్లి కొడుకు సురక్షితముగా పైకివచ్చుటచూచి పొందిన యానందముకు అంతులేకపోయెను. కాని తానన్న మాట ఎట్లు కాదనును? ఆమాటయె శంకరునికి సన్న్యాసమునకు అనుజ్ఞ ఇచ్చినట్లయినది. తల్లిని ఎట్లో ఓదార్చి తల్లి ఎప్పుడు రమ్మనిన అపుడు వచ్చెదనని చెప్పి దీక్షయిచ్చు గురువు నన్వేషింప బయలుదేరెను. అట్లు శంకరుడు గృహమును విడిచి వెళ్ళుచు దారిలో వనములు గ్రామములు శైలములు దాటి పోవుచుండెను. "గారడివాడు ఇంద్రజాలమును జూపుచున్నట్లు భగవంతుడు నాకు ఈ వనాదులను ప్రదర్శింపజేయుచున్నా"డని అతడు తలచెను. నర్మదానదీ తీరమున నొకగుహలో తపస్సుచేయుచున్న గౌడపాదుఁడను నాచార్యుని గనుగొని యతనిదగ్గర దీక్షపొంది ఉపనిషత్తులను బ్రహ్మసూత్రాదులను పఠించెను. ప్రథమ దర్శనములోనే నీవెవ్వరవు అనుప్రశ్నకు నేను భూమినిగాను జలాదులను వానిగుణములునుగాను ఇంద్రియములనుగాను పరమ శివుడను అని చెప్పిన శంకరుని ప్రతిభకు శక్తికి సంతోషించి యతనికి శంకరాచార్యులు అనునామ మొసగెను. అద్వైతమతమును బోధించెను. ఉపనిషదాదులకు భాష్యములు రచించి వారణాసినుండి మొదలుపెట్టి ప్రచారము చేయ సెలవిచ్చి గోవిందపాదుఁడు పంపెను. గౌడపాదకారికలని ప్రసిద్ధిపొందిన మాండూక్యోపనిషత్తుకు వివరణప్రాయమైన కారికలు ఈ గౌడపాదునిచే రచింపబడినవే. పిదప శంకరాచార్యులు ఈ కారికలకు భాష్యము కూడ రచించెను. శంకరాచార్యులు గౌడపాదుని దగ్గఱ సెలవుతీసికొని వారణాసికి వచ్చెను. వారణాసియందు శంకరాచార్యులు బ్రహ్మసూత్రముల

మీఁదను, ఉపనిషత్తులమీదను, భగవద్గీతమీదను భాష్యములు రచించెను. ఈ భాష్యములలో తత్పూర్వములగు న్యాయ సాంఖ్య వైశేషికాది మతము లను వైభాషికాది నాస్తికమతములను ఖండించి యద్వైతమతమునె నిరూపణ చేసెను.

కాశీపట్టణములో ఒక బ్రాహ్మణ కుమారుఁడు సునందుడనువాడు వచ్చి శంకరాచార్యులయొద్ద దీక్ష గైకొనెను. తరువాత ఇతడు పద్మపాదుడనబడెను. ఇట్లే అనేకులు వచ్చి దీక్షగైకొని శిష్యులైరి. ఒకనాడు శంకరుడు సూర్యుడు నెత్తిమీదకు వచ్చిన సమయమున అహ్నిక కృత్యమును నెరవేర్చ వెళ్ళు చుండెను. అప్పుడు ఒక చండాలుడు ఎదురయ్యెను. శంకరు డాచండాలుని జూచి "దూరముగా నుండుము" అనెను. ఆ చండాలుడు "ఎవరిని దూరముగా నుండమనుచున్నావు దేహమునా దేహములో నున్న యాత్మనా? నాలోని యన్నమయకోశమును నీలోని యన్నమయకోశమును భిన్నములా? నీలో సాక్షిగానున్న యాత్మకును నాలో సాక్షిగానున్న యాత్మకును భేదమున్నదా? గంగయందు ప్రతిబింబించిన సూర్యునికిని మద్యమందు ప్రతిబింబించిన సూర్యునికిని భేదమున్నదా? నేను బ్రాహ్మణుడను నీవు చండాలుడవు అని వట్టి యాగ్రహమేల?" అని యనెను. అంతతో శంకరునిలోనున్న యతి స్వల్పమైన యజ్ఞానమును వీడెను. ఆ శంకరుడు ఆ చండాలుని సాక్షాచ్ఛివునిగా భావించి "ఛండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ" అని బ్రహ్మవేత్తయైనవాడు ఛండాలుడైనను నాకు గురువే అని తన్ను బోధించికొనెను.

పిదప శంకరుడు యాత్రలు చేయుచు అనేకులను మతప్రచారకులను ఖండించెను. భాస్కరుడు అభినవగుప్తుడు మొదలైనవారిని ఓడించెను. ధర్మగుప్తుఁడు, ఉదయనాచార్యుడు, కుమారిలుడు ప్రభాకరుడు మొదలగువారి సిద్ధాంతములు సరియైనవి కావని ఋజువు చేసెను. ఇతడు బ్రహ్మసూత్రాదులకుజేసిన భాష్యములు వ్యాసుని హృదయాభిప్రాయముకు సరిగానున్నవని మహాపండితప్రకాండులు మెచ్చుకొనసాగిరి. కేవలము శంకరుడే యవతరించి మతసిద్ధాంతములను ప్రచారము చేయుచున్నట్లు ఈ శంకరా

చార్యుని సర్వులును ప్రశంసించిరి. పిదప బౌద్ధమతములను ఖండించి కుమారిలభట్టు శంకరుని భాష్యమునకు వార్తిక మను గ్రంథమును రచించెను.

ఈ విధముగా ఇతర మతములను ఖండించుచు శంకరుడు మాహిష్మ పురమునకు వచ్చెను. మాహిష్మతీపురములో కర్మకాండమున బహుశ్రద్ధ కలిగిన వేదవేత్తయయిన, మండనమిశ్రుడను మహాపండితుడు గలడు అతనికి జ్ఞానకాండమునందు శ్రద్ధ గలిగించి యద్వైతునిగా జేయ దలచి పోయెను. ఏ గృహద్వారమున చిలుకలు "వేదములు తమంత తామె ప్రమాణములా? ఇతర ప్రమాణములను బట్టి ప్రమాణములా" అని వాదించుచుండును. అదె మండనమిశ్రుని గృహమని నీళ్ళు తెచ్చుకొను స్త్రీలు తెలిపిరి. శంకరాచార్యులు సంన్యాసి గాన గృహస్థుడగు మండనమిశ్రుని యింటికి బోయి వివాదభిక్ష యిమ్మని కోరెను. పిదప వారిద్దరు వాదింపదొడగిరి. వారి వాదములలో జయమెవరికి గలుగునో ఆ నిర్ణయమును చేయుటకై సకల విద్యావిశారదయగు మండనమిశ్రుని భార్య శారద మధ్యవర్తినిగా నియింపబడెను. ఆమెకు ఉభయభారతి యని బిరుదనామము గలదు. వారి వాదము పదునేడు దినములు సాగినది. మండనమిశ్రుడే యోడినట్లు ఉభయ భారతి నిర్ణయించినది. కాని అర్థాంగిని యగు తన్ను జయించినగాని పూర్తిగా జయించుట కాదని చెప్పి పదునేడు దినములు వాదించి పిదప శంకరునికి దెలియని కామశాస్త్రములో ఆమె వాదింప దొడగెను. కామ శాస్త్రము తెలిసిన గాని సర్వజ్ఞుడు గానేరడు. అప్పుడు శంకరుడు ఒక నెల వ్యవధి కోరెను. ఆమె సరె యట్లె యన్నది. అప్పుడు శంకరుడు చని పోయిన యమరుక రాజు శరీరములో యోగశక్తి ద్వారా ప్రవేశించి కామ శాస్త్ర విషయములను గ్రహించెను. శంకరుని శరీరము ఒక గుహలో శిష్యులచే దాచబడి రక్షింపబడుచుండెను. అమరుక రాజు మంత్రులు "తమ రాజు శరీరములో ఒక మహానుభావుడు పరకాయ ప్రవేశము చేసియుండును" అని యతని నడతను బట్టి గ్రహించి మృతమైనట్లు గనబడు శరీరములను తగులబెట్ట భటులకు ఆజ్ఞ యిడిరి. అది తెలిసి శిష్యులు అమరుకుని సభలో ప్రవేశించి అన్యాపదేశముగా "తత్త్వమసి" నీవు తెలిసికొనబడితివి" అన

నర్థము వచ్చునట్లు పలికిరి. శంకరుఁడది గ్రహించి మరలఁ దన శరీరములోఁ బ్రవేశించెను. పిదప ఆ యుభయభారతిని జయించెను. మండనమిశ్రుడు శంకరుని దగ్గఱ దీక్ష గైకొని పిదప సురేశ్వరాచార్యుడనఁబడెను.

అతఁడు క్రమముగా శ్రీశైలముదాఁక పరిచారము చేయుచు వామాచారులగు కాపాలికుల మతము ను పాశుపతవైష్ణవ వీరశైవ మహేశ్వరాదుల మతములను సురేశ్వరాములచే శంకరుఁడు ఖండింపించి వారికి తనయద్వైత మతమును బోధించెను. హస్తామలకుఁడు ఆనందగిరి మొదలగువారు ఇతనికి శిష్యులై యనేక గ్రంథములు అద్వైత బోధకములుగా రచించిరి. పిదప ఆనందగిరి వేదాంత బోధకముగా తోటకవృత్తములు రచించుటచే తోటకాచార్యుఁడనఁబడెను.

ఇంతలో శంకరాచార్యులు దన తల్లికి అనారోగ్యముగానున్నట్లు తెలిసి కాలడికి వచ్చెను. జగద్గురువయి వచ్చిన కొడుకును జూచి తల్లి బ్రహ్మానందమును బొందెను. కొడుకు వచ్చిన కొలది కాలమునకె తల్లి మరణించెను. ఆ సమయములో "ఇతఁడు సంన్యాసియయ్యుఁ గర్మ చేయుచున్నాఁ" డని తలఁచి బంధువులెవ్వరును రారైరి. అయినను శంకరాచార్యులు తల్లికిచ్చిన వాగ్దానము ప్రకారము తల్లి శరీరమును తన ఇంటిదగ్గఱనే దహనము చేసి యుత్తరక్రియలాచరించెను.

అనంతరము జగద్గురువు శంకరాచార్యులు వేలకొలది శిష్యులతో గూడి యద్వైత మతమును స్థాపింప జైత్రయాత్రచేసి సర్వమతములను ఖండించెను. మరియు అనేక స్తోత్రములను ఉపదేశసాహస్రి మొదలైన గ్రంథములను రచించెను. అద్వైతమత ప్రచారమునకై శారదా పీఠములను స్థాపించి, మైసూరులోని శృంగేరిమఠ పీఠమునకు సురేశ్వరాచార్యులను పూరిలోని జగన్నాథమఠ పీఠమునకు పద్మపాదుని, ద్వారకా మఠమునకు హస్తామలకుని, హిమాలయము బద్రీనాథ దారిలోనున్న జోషీమఠమునకు తోటకాచార్యులను అధిపతులనుగా వించెను? ఇపుడు మన భారత వర్షములో చాలామంది శంకరమతావలంబులుగానె యున్నారు.

శంకరుడు పిదప కామరూప దేశములో గౌహతికి వెళ్ళెను. అప్ప అక్కడ తాంత్రికుడైన యభినవగుప్తుని ఓడించెను. పిదప అతనికి భగంద రోగము గలిగెను. పిదప పద్మపాదుడు మంత్ర ప్రభావమున దానిని తగ్గి చెను. ఆ జగద్గురువు ఈవిధముగా అద్వైత మతమును స్థాపించి కేదా నాథులో క్రీస్తుశకము 820 సం॥రంలో అతని ముప్పది రెండవయేట పరి పరమపదించె. ఇంత చిన్నతనములో సర్వమతముల ఖండించి బోధచేసి యద్వైత మతమును మనము గ్రహించి ముక్తులముగుదుముగాక!

—o—

## శాంకర దర్శనము

సాంఖ్యులు చెప్పిన ఈ పరిణామ వాదము ప్రామాణిక మైనది కాద చైతన్యము ఆధారముగా ప్రధానము (సత్త్వ రజ స్తమ స్సామాన్య రూపము సృష్టికార్యమందు ప్రవర్తింపదు. కంకణము మొదలైన వానికి కారణమై బంగారము మొదలైనవి కంసాలి మొదలైనవారు లేకుండ కంకణములుగా గాలేవు. కృత కత్వము నిత్యత్వమును సాధింపలేనట్లు సుఖ దుఃఖము మోహ రూపములుగా అగుటకై సాధనము సాధ్యా భావమునందు వా పించి యుండుట వలన విరుద్ధమయి కార్యమును సాధింపదు. విరుద్ధవ న్నది కార్యములో హేతువు కాక హేతువుగా తోచునట్లు ఉన్న కారణము ఉదా:- శబ్దము నిత్యము కృతకమగుటవల్ల అని యనుమానము చేయబడ బడుచున్నది. కృతకత్వ మనగా ఏదో దానిచే చేయుబడిన దన్నమాట చేయ బడినదెల్ల నశించి పోవునదే. నిత్యముకాదు. అందుచే చేయుబడిన దన హేతువు ఎల్లప్పుడు చేయుబడక యుండు నిత్యముగాని ఘటాది కార్యములంద ఉండును గాన ఆ కృతకత్వము నిత్యత్వమును సాధించునది కాదు. అందుచే నిత్యత్వమును సాధింపని వస్తువులందు వ్యాపకమై యున్నది కాన కార్య మును సాధింపదు. అట్లే చేతనములేని ప్రధానము సృష్టి కార్యమును సాధిం పదు. ఎక్కడెక్కడ సృష్టి కార్యము ఉన్నదో అక్కడచేతనత్వము ఆధార ముగా నున్నది. చేతనములు ఆధారముగాలేని జడములు సృష్టి కార్యము చేయ లేవు. ఎక్కడెక్కడ చేతనము ఆధారముగా నుండదో అక్కడ సృష్టికార్యము

జరగదు. చేతనము కాకపోవుట వలన అన్న హేతువు సాధనము. సుఖ దుఃఖ మోహాత్మక కార్యములకంటె భిన్నమైన జడమునందు వ్యాపకమైనందున విరుద్ధ మనెడి హేత్వాభాస యైనది. కాన అదికార్య సాధకము కాదని భావము. అందుచే ప్రధానము సృష్టిచేయునను సాంఖ్య సిద్ధాంతము అప్రామాణికము. విరుద్ధములేకాక స్వరూపాసిద్ధములు గూడ పక్షములైన చందనాది పదార్థములు సుఖదుఃఖాది మోహాన్వితములు గావు. సుఖాదులు ఆంతరమగు మానస ప్రత్యయ గోచరములు చందనాదులైతే బాహ్యచక్షువులకు తెలియదగినవి. చందనము ఒకప్పుడు చందనముగాను ఇంకొకప్పుడు చందనము కానిదిగను ఉండదు. అట్లే వేసవికాలములందు గూడ కుంకుమ పంకము సుఖమగుమ. అది ఒక్కొకప్పుడును కుంకుమ పంకముగాకుండనుండదు.

ఇట్లే ముళ్ళు ఒంటెకు వలె మనుష్యాది ప్రాణులకు కూడ సుఖములు కావలయును. కనుక చందన కుంకుమాదులగు విశేషములు కాలమునుబట్టి సుఖాది హేతువులగును గాని సుఖాది స్వభావములుగావు. కనుక హేతువు అసిద్ధమని సిద్ధించినది.

సృష్ట్యాదులకు ప్రధానము కారణమనుటలో శ్రుతియు (శ్వేతాశ్వ 4-5) ప్రమాణము గాదు. "యదగ్నే రోహితం రూపం తత్తేజస స్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం, యత్కృష్ణం తదన్నస్య (ఛాం 6-4-1) అగ్నియందు రోహిత రూపము తేజస్సది. ఏ శుక్ల రూపమున్నదో అది నీటిది.

ఏది నలుపు రూపమో అది అన్నముది. ఇట్లు ప్రకృతికి లోహిత శుక్ల కృష్ణ రూపములు చెప్పబడినవి, అవే గుర్తింప బడుచున్నవి. అక్కడ శ్రుత్యుక్త ప్రత్యభిజ్ఞ యొక్క ప్రాబల్యమువల్ల లోహితాది శబ్దములకు ముఖ్యార్థము సంభవించుట వల్లను గూడ తేజస్సు నీరు అన్న రూపమైన జరాయుజములు (జంతువులు మనుష్యులు) అండజములు (గుడ్డునుండి పుట్టిన పాములు మొదలగునవి, స్వేదములు (పేలు, నల్లులు మొ॥నవి) ఉద్భిజ్జములు (నేలను పెల్లగించుకొని వచ్చు చెట్లు చేమలు మొదలగు రూపములుగల భూతసముదాయమునకు ప్రకృతి స్థిరపడుచున్నది.

మరి తేజోజలములు ప్రకృతినుండి పుట్టినవి. యోగవృత్తిచే (వ్యుత్పత్తిచే అజ అను పదము పుట్టినది కాదు కాన అను నర్థము గలది. కాన ప్రకృతి అను పదమునకు పుట్టినదికాదు అను నర్థము ఎట్లు కుదురును. అయినప్పటికి రూఢిని బట్టి తెలియఁబడిన యజాత్వ మనుపదము పైె చెప్పిన ప్రకృతి పదము చేత అజ అను దానికి సుఖముగా తెలియుటకు ప్రకృతి యని యర్థము కల్పించఁబడుచున్నది. ఎట్లనఁగా "ఈ సూర్యుడు దేవతకు మధువు (ఛా 3.1,1.) అనుదానిచే సూర్యునకు మధు రూపార్థము కల్పింపఁబడినట్లు తేజో జలాది రూపప్రకృతి అజ అని కల్పింపబడుచున్నది. కనుక 'అజామేకాం' అను శ్రుతి కూడా ప్రధానమును తెలుపునది కాదు.

చేతనముచే అధిష్ఠితము కాని అచేతనమైన క్షీరాదికము వత్సపోషణకై ప్రవర్తించుచున్నదని నిదర్శనముగా పూర్వపక్షి చెప్పినదియు రమణీయము కాదు. బుద్ధి విశేషము గల పరమేశ్వరుఁడే కూడ ఆ పాలలో అధిష్ఠాతగా ఆధారముగా ఉన్నాడని యంగీకరింపబడినది. కనుక పరమేశ్వరుని కరుణచే ప్రవర్తించు చున్నదని యంగీకరించినపుడు ఇది వరలో చెప్పిన వికల్పము యవసరము ఉండనే యుండదు. సృష్టికి పూర్వము ప్రాణులకు దుఃఖ ముతో సంబంధము ఉండుటయు సంభవింపకపోయెను. దానికి నిదాన అదృష్ట సంబంధము సంభవించుటచేత దానిని పోగొట్టుకొను నిచ్ఛను బట్టి ప్రవర్తించుట ఉపపన్నమగును. మరియు పురుషార్థము కొఱకు ప్రయుక్త మైన ప్రధానప్రవృత్తి జరుగునని చెప్పఁబడిన దానిని వివేచింపవలసి యున్నది.

ప్రధానము కేవలము భోగము కొఱకే ప్రవర్తించు చున్నదా లేక కేవల మోక్షము కొఱకు ప్రవర్తించు చున్నదా లేక రెండిటికోసమా? మొదటిది సరి కాదు అదే యతిశయము లేక కూటస్థ నిత్యుఁడైన పురుషునికి తాత్త్వికభోగము సంభవింపదు.

అట్లన్నచో మోక్షమన్నదే లేదన వచ్చును. ఏ ప్రయోజనముచేత ప్రధానము ప్రవర్తించుచున్నదో దానిచేనది విధింప వలసి యున్నది. భోగము చేత గూడ ఇది ప్రవర్తించినదన్నచో దానినే విధించవలయును గానమోక్షమునుగాదు.

ఇంక రెండవ పక్షమును సరికాదు. చితిధాత్వర్థము నిత్యశుద్ధముక్త స్వభావము గలదమటచేత కర్మ అనుభవింపజేయు వాసనలు సంభవింపకపోవుట చేత ప్రధానము ప్రవర్తించుటకు పూర్వము యుక్తమగుటచే దానికొఱకై ప్రవర్తించెననుట ఉపపన్నముగాదు. ప్రధానము శబ్దాదుల యుపభోగము కొఱకు ప్రవర్తింపక పోవుటవలన వానిని పుట్టించకపోవుట ప్రసక్తమగును.

ఇంక మూడవ పక్షమును సరికాదు. ఇదివరలో చెప్పిన దూషణములను దాటక పోవుట వలన. ప్రవృత్తి యోగ్యభావముగల ప్రకృతి తటస్థముగా నుండుననుట కుదురదు కాన. సత్య పురుషాన్యతాఖ్యాతియె పురుషార్థ మన్నచో అట్టిది కలిగినపుడు తాను చేయవలసినది పూర్తియైనది కాన అది నివర్తించును అన్నచో అది సరికాదు. అచేతనమైన ప్రకృతి ఆలోచించి కార్యము చేయుననుట సంభవింపదు. ఇది ఇట్లు శబ్దాదులను అనుభవింపఁ జేసినను వానికై మరల ప్రవర్తించు చున్నదో ఇట్లే ఇక్కడఁగూడ మరల ప్రవర్తింపవలసి వచ్చును. ఏలయన దాని స్వభావము పోవదు గదా.

మరియు ఆ ప్రకృతి వివేకము గలిగినపుడు నశించునా? నశింపదా, అన్నియు నశించుచో ఇపుడింక సంసారమే అస్తమించి పోవును. నశింపదన్నచో దేనికిని మోక్షమన్నదే కలుగక పోవలసి వచ్చును. బంధ మోక్షములు ఆయా పురుషుల వివేకమే లక్షణముగాగల సత్తు అసత్తు అనునవే కారణములుగా కలవిగాన అది యుపపన్నమగునన్నచో ఓహో బాగున్నది అపుడు ప్రకృతివల్ల పనిసిద్ధించినట్లే. అవిద్య లేకపోవుటవల్లనే అది యుపపన్నమగుచున్నది గదా మరి అవిద్యా పక్షములో గూడ ఈ దోషము అర్పవించునన్నచో

ఇది ఆ స్థానములో ప్రత్యయ స్థానమగును. మేము ప్రధానమును వలె అవి విద్యను సర్వజీవులందును పొందించునది యొకటే యని చెప్పుటలేదు. పైగా ప్రతి జీవునియందు వేరుగా నుండును. అందుచే ఏ జీవునికైతే విద్య కలుగుచున్నదో దానికే ఆయవిద్య నశించును ఇతరునికి నశింపదు. భిన్నమైనచోటు గలవానికి విరోధము లేకపోవుట వలన. కనుక సమస్త సంసారము నశించి పోవలసి వచ్చునను దోషప్రసక్తిలేదు. కనుక పరిణామ వాదము త్యజింప దగినదే. వివర్తవాదమే స్వీకరింపదగినది. పూర్వావస్థను విడువకుండ ఇంకొక యవస్థను పొందినట్లు తోచుటె వివర్తమనఁగా. త్రాడు పాముగా గాక త్రాడుగానే తోచుట, సరే మరి జీవ జడములకు పోలిక లేకపోవుటచేత ప్రపంచము చిత్తుగా వివర్తత్వమును పొందుట(తోచుట) ముత్యపుచిప్ప వెండిగా తోచుట, సందర్భింపదని యిదివరలోనే చెప్పితిమిగదా. అన్నచో అది సాధువుగాదు. అన్ని భ్రమలు సారూప్యమే ఆధారముగాఁ గలవిగావు గాన వ్యాప్తిలేదు. సమాన రూపములేని కామాదుల వలన కాంతాలింగనాదులందు వలె స్వప్న భ్రమము లభించుట వలన. మరియు ఒకానొకప్పటి విభ్రమమందు నానావిధమైన అవిద్య నిబంధనగాగల ప్రపంచమందు సారూప్యాపేక్ష గలుగును. రూపములేని చీకటిలో స్థల మలినతా విభ్రమము బాలురకు కలుగుచున్నది. అదే ఆచార్య వాచస్పతి చెప్పెను.

వివర్తస్తు ప్రపంచోయం బ్రహ్మణోఽ పరిణామినః
అనాది వాసనో ద్భూతో నసారూప్య మపేక్షతే"

మార్పుచెందని బ్రహ్మకు ఈ ప్రపంచము వివర్తము. అనాది వాసనచే ప్రకటమై సారూప్యమును అపేక్షింపదు అని. ఇదంతయు వేదాంతశాస్త్రము నందు పరిశ్రమ చేసిన వారికి సులభముగా తెలిసినదే. బాగుగ కుదురునది కూడ. ప్రతి శరీరమును స్ఫురించున్నది (అంచతి) కనుక ప్రత్యగాత్మ అనఁగా జీవాత్మ!

ఈ వేదాంతశాస్త్రము నాలుగు లక్షణములు గలది. భగవంతుఁడైన వ్యాసునిచే రచింపఁబడిన వేదాంతశాస్త్రమునకు జీవబ్రహ్మైక్యమె విషయము

అని శంకరాచార్యులవారు ప్రతిపాదించిరి. అందులో మొదటి సమన్వయాధ్యాయములో అన్ని వేదాంతములకు బ్రహ్మమందె తాత్పర్య నిర్ణయము. రెండవ అవిరోధాధ్యాయముతో స్మృతి సాంఖ్యాది తర్కములకుఁగల విరోధమును పరిహరించుట. మూడవ సాధనాధ్యాయములో బ్రహ్మవిద్యా సాధనము. నాల్గవ ఫలాధ్యాయములో విద్యా ఫలము. అందు ప్రతి యధ్యాయములో నాలుగేసి పాదములు గలవు. అందు మొదటి యధ్యాయములోని మొదటి పాదములో స్పష్టమైన బ్రహ్మమునకు సూచకమైన వాక్య సమూహము మీమాంసింపబడెను. రెండవ పాదములో అస్పష్టబ్రహ్మలింగము ఉపాసింపఁదగిన విషయము. మూడవ యధ్యాయములో అటువంటి జ్ఞేయ విషయము. నాలుగవ యధ్యాయములో అవ్యక్తముగానున్న అజ మొదలగు సందిగ్ధములగు పదసమూహము. రెండ యధ్యాయపు మొదటి పాదములో సాంఖ్యయోగ కణాదాది స్మృతులకు విరోధమును పరిహరించుట. రెండవ పాదములో సాంఖ్యాది మత దోషనిరూపణము. మూడవ యధ్యాయములో పంచ మహాభూత శ్రుతులకు జీవ శ్రుతులకు గల పరస్పర విరోధమును పరిహరించుట. నాలుగవ యధ్యాయములో లింగ శరీర స్మృతులకు గల విరోధమును పరిహరించుట. విచారణ అనగా స్వపక్ష సిద్ధాంత స్థాపనము. పర పక్ష సిద్ధాంత నిరాకరణ రూపమును. పంచ జ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు పంచ ప్రాణములు మనస్సు బుద్ధి అను పదునేడు పదార్థముల సంఘాతమె లింగ శరీరమనఁబడును. మూఁడవ యధ్యాయపు మొదటి పాదములో జీవుని పరలోక గమనము పరలోకమునుండి వచ్చుట విచారణలతో గూడిన వైరాగ్యము రెండవ పాదములో తత్త్వమసి వాక్యములో త్వంతత్ అను పదముల విచారణ, మూడవ పాదములో సగుణ విద్యలందలి గుణముల యుపసంహారము నాలుగవ పాదములో నిర్గుణ బ్రహ్మవిద్యకు బహిరంగ సాధనములైన బ్రహ్మచర్యాద్యాశ్రమములు, కర్మలుయజ్ఞయులు, అంతరంగ సాధనములైన శమదమ నిదిధ్యాసాదులు నాలగవయధ్యాయపు మొదటి పాదములో బ్రహ్మ సాక్షాత్కారముద్వారా జీవించి యుండఁగనే పాపపుణ్య క్లేశ రాహిత్య రూపమైన ముక్తి జీవన్ముక్తి. రెండవ పాద

ములో మరణించినపుడు శరీరమును విడచుట, ప్రవేశించు ప్రకారము. మూడవ పాదములో సగుణ బ్రహ్మోపాసకుని యుత్తర మార్గము. నాలుగవ పాదములో నిర్గుణ సగుణ బ్రహ్మవేత్తలకు విదేహ కైవల్య బ్రహ్మలోకావ స్థానములు. ఈ విధముగా బ్రహ్మమును విచారణచేయు శాస్త్రములోని యధ్యాయము లలోని పాదముల విషయ సంగ్రహము చెప్పఁబడినది.

అందు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" (బ్ర. 1.1.1) అనునది బ్రహ్మజిజ్ఞాసను ఆరంభించుటకు ఉపపాదించిన మొదటి యధికరణ సూత్రము. అధికరణములో అయిదు అవయవములు గలిగి యుండుననుట ప్రసిద్ధము. అవి విషయము సందేహము, పూర్వపక్షము, సిద్ధాంతము, సంగతి అనునవి. "ఆత్మా అరే ద్రష్టవ్యః" (బృహ. 2.4.5) ఓసీ ఆత్మ చూడదగినది అను వాక్యము విషయము. బ్రహ్మజిజ్ఞాసింప వలసినదా కాదా అనునది సందేహము. ఎక్కడైతే జిజ్ఞాసింపఁదగి యుండుట కలదో అక్కడ సందేహము ప్రయోజనము అమనవి రెండు అవసరమే. ఏ విషయములో సందేహములేక నిశ్చిత రూపము కలదో అక్కడ ప్రయోజనమున్నను జిజ్ఞాసింప వలసిన యవసరములేదు. ఏందుచేననఁగా అది తెలిసిన విషయమె గనుక. అట్లే ఎక్కడ ఫలములేదో అక్కడ సందేహమున్నను జిజ్ఞాసింప వలసినదికాదు. ఏలయనఁగా ఆ తెలిసికొనుట నిరర్థకము గనుక. ఎక్కడ సందేహ ప్రయోజనములు సంభవింపవో అక్కడ సుతరాము జిజ్ఞాసింపవలసినది లేనేలేదు.

సరే అక్కడ ఏదిఅసలు జిజ్ఞాసింపవలసినదిగా తోచుచున్నది. నేనను అనుభవముచే గమ్యమైనదానికా? శ్రుతిచే గమ్యమయిన దానికా? అందులో మొదటిది కాదు. సర్వజనులకు గలుగు నేను అను అనుభవ సిద్ధమైన ఈ దృశశరీరాదులకంటె భిన్నమైన ఆత్మయొక్క వివేకముచేత జీవాత్మ శరీరముకంటె భిన్నమని పటిష్ఠముగా భాసించుటచేత జిజ్ఞాస అవసరమేలేదు కనుక. సరే మఱి నేను స్థూలమైన వాఁడనుకృశుఁడను ఈ మొదఁగు దేహధర్మములు గల వాడనను అనుభవము గలుగుచున్నది గాన ఆత్మయందు ఆరోపింపబడిన దేహమునుబట్టి కలిగినది ఈ నేనను అనుభము అన్నచో అట్లనరాదు. ఏల

అన బాల్య యౌవనాద్యవస్థలయందు "నేను బాల్యములో క్రీడానందమును అనుభవించితిని. యౌవనములో విషయానందమనుభవించితిని. ఆ బాల్యములో నున్నవాడను నేనే అను ప్రత్యభిజ్ఞకు ప్రసిద్ధి కలుగుచున్నది, కాన దానిని బట్టి రేగిపండు, ఉసిరికాయ మొదలగు వానివలె శరీరమునకు ప్రతిజ్ఞ అనుపపన్నమగును.

✲ ఇంక మరి పీలుపాక పక్షమునందుగాని కాలభేదముచేత ఒకే వస్తువునందు పాకము వల్లగలిగిన భేదము ఉపపన్నమైనట్లు శరీరమనే ఒకే వస్తువునందు కాలభేదముచేత పరిణామ భేదము కలుగుచున్నది. కనుకనే ఆత్మకంటె శరీరమును అభిన్నముగా తలచువారెవ్వనను సరే వారు లౌకికులు (చార్వాకులు) ప్రతిజ్ఞ చేయుచున్నారు, అన్నచో అది సరియైనది కాదు. మణి మంత్రౌషధాది భిన్నోపాయము.లను బట్టి ఒక క్షణము పెద్ద పులిగాను, ఒక క్షణము ఏనుగుగాను, ఒక క్షణమందొకొక్క దాని వలెనయి మరల పూర్వ మనుష్యాది రూపములను పొందును. అక్కడ ఒకే జీవాత్మ నటునివలె అనేక పాత్రల పొందును. కనుక అందు ఆత్మకు దేహ భేదము భాసిం

---

✲ పీలుపాకవాదము—పీలువులు పరమాణువులు ద్రవ్యములో తేజస్సంయోగముచే పరమాణువులందు ద్వ్యణుకాదుల యందు పాకము కలిగి అవయవి (ఘటాదుల) వరకు రూపాదులు మారుట. పూర్వ రూపాదులు పోయి క్రొత్త రూపాదులు పొందుట. ఇందు అణువుల ద్వారా అవయవములు మార్పు చెందును. దీనిని పీలుపాకవాదమందురు. ఇది పరమాపుల మార్పు.

పిఠరపాకవాదము—అవయువములు కాక అవయవి (ఘటాదులు) అంతయును ఒకేమారు పూర్వరూపాదులు నశించి క్రొత్త రూపాదులు పొందుట.

పిఠరము=అవయవి ముద్ద, ఘటాదులు మొత్తముగా ఒకేసారి పాకముచే కొత్త రూపమును పొందుట.

చుటస్పష్టమే దీనిని బట్టి దానికంటె అతిరిక్తమైన జీవాత్మయే నేను అను జ్ఞానమునకు విషయమగుట ప్రసిద్ధము. కనుక నేత్రాదులకు నేను అనునది ఆధారమగుట శంకింప శక్యముగానిది. శరీరము కంటెను ఇంద్రియాదుల కంటె గూడ ఆత్మ భిన్నముగా ప్రతిభాసించు చున్నది.

అపుడు నాన్యదృష్టం స్మరత్యన్యః (న్యాయ, కుసు 1-15) "ఒకడు చూచిన దానిని ఇంకొకడు స్మరణకు దెచ్చుకోడు" అను న్యాయమును బట్టి చక్షురాదులు నశించు నపుడు రూపాదులను ప్రతి సంధానము చేయుట యుపపన్నము కాకపోవలసి వచ్చును. అంతఃకరణమునకును 'నేను' అనునదే ఆలంబన మన్నది సిద్ధింపదు. విరుద్ధమైన ధర్మమును ఆరోపించుటయే భేదము కారణ భేదమే భేద హేతువు అను న్యాయముచేత కర్తయైన ఆత్మకు కారణమైన అంతఃకరణమునకును వడ్రంగికి వాని పరికరములకు వలె భేదము సంభవింపదు. కనుక రెండింటికి అభేదము ఆదరింపక పోయి నచో అపుడు నేను స్థూలుడను, నేను కృశుడను, నేను కృష్ణుడను ఇత్యాది వ్యవహారము లుప్త ప్రాయమైపోవలసి వచ్చును. అట్లు లుప్త ప్రాయము గాదు ఇట్లే లోకములోను, శాస్త్రములోను రెండు విధముల శబ్ద ప్రయోగము సంభవించుటచేత ముఖ్యార్థము ఉపపన్నము కానపుడు మంచములు అర్చుచున్నవి. అను చోటవలె లాక్షణికముగా ఉపపన్నమగు చున్నది.

ఇంక రెండవ శ్రుతి గమ్యమును గాదు, నేను అనునది అనుభవమైనదే శ్రుతి గమ్యమగుచున్నది గాన 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ - తై 2-1-1 ఇత్యాది శ్రుతులవల్ల బ్రహ్మము గమ్యమగు చున్నది గదా! బ్రహ్మ భావశ్చ అహమాత్మా బ్రహ్మ ' (బృహ 2-5-19) తత్త్వమసి (ఛాందో 6-8-7) ఇత్యాది శ్రుతులయందు నేను అను జ్ఞానముచే గమ్యమైన దానికిబాధ కలుగు చున్నది. అట్లును ఈ అనుమానము సూచింప బడినది. విమతము జిజ్ఞాసింప దగినదికాదు, సందిగ్ధముకాదు కనుక కరతలామలకము వలె

సందేహము సంభవింపదను దానిని బట్టి యింక ప్రయోజనము సంభ

గోదారిని దాటుట వంటిది. బహ్మ జిజ్ఞాస వల్ల సంసార నివృత్తి కల్గునను ప్రయోజనము వ్యర్థమే ఆత్మ యొక్క యాథాత్మ్యానుభవమును గూడ నున్న సంసారము రూప రసము వలె విరోధము లేకపోవుటచే ఒకటి నివర్తింప దగినది ఇంకొకటి నివర్తింపజేయలేనిది అన్నది లేదు కనుక సరే ఓయీ మనతో కూడ వను వర్తించు బోధ సంసారమును బాధించకపోవు గాక కూడ అవర్తించు బోధ వెలుగు చీకటుల వలె బాధింపదు గదా! అన్నచో అది వట్టి వాక్క మాత్రమే, నేనను అనుభవము కంటె భిన్నమైన ఆత్మ జ్ఞానము ఎలుక కొమ్ము వలె లేనిది కదా! అది లేదు అన్న అనుభవము పామరులకు కలుగకపోనిమ్ము. వేదాంత వాక్య నిచయము పర్యాలోచించు నేర్పు గలుగు పరీక్షలకు సంభవించునె అనియు చెప్పరాదు. బాధింపని అనుభవమునకు విరోధముండుట చేత వేదాంత వాక్యములు 'రాళ్ళు తేలుచున్నవి' అను మాట వంటివే కదా! శాస్త్రములు వేలు కలసి గూడ కుండను బట్టగా చేయలేవు గదా! అపుడు అధ్యయన విధికి వ్యాకోపము లేదు. చదువు అర్థ జ్ఞానము ద్వారా కర్మలో ఉపయోగించును.

అసంభవమైన యర్థమును చెప్పు వాక్యమునకు అట్లు ఉపయోగము లేదు కనుక చదువు నిష్ఫలమే కనుక స్వాధ్యాయము అధ్యయనము చేయ దగ్గది అను అధ్యయన విధి ప్రవృత్తి విరోధించునని భావము. కనుక అర్థము సంభవించినచో గ్రహింపుము సంభవించక పోయినచో త్యజింపబడు గాక. గురుమతము ననుసరించి హుమ్ ఫట్ మొదలైన వాక్యముల వలె జపమునకు మాత్రమే ఉపయోగించును గాక! "అచార్య మతమును బట్టి గాని యజమానుడు (తై I-5-4) ఇత్యాది వాక్యములకు లక్షణ చేత ప్రాశస్త్యమందు తాత్పర్యమును కల్పించుకొని వేదాంత సిద్ధాంతము అధ్య యనము చేయ దగ్గది అనుట సంభవించును. కనుక ఆ ఫలము అ ప్రామాణ్యముగ స్వీకరింప బడదు. కనుక బ్రహ్మము ప్రసాదించు వేదాంత వాక్యములకు జీవ ప్రాశస్త్య బోధనలో తాత్పర్యమును, ఆ జీవుడు యజ్ఞాదుల యందు కర్త గాని ఉపాస్యదేవత గాని యుగునవి అట్లు దానికి

యోగము కలదు. "వివాదాస్పదం బ్రహ్మ వివాదాస్పదం నభవతి అఫల త్వాత్కాక దంతవత్" కాకికి ఎన్ని పండ్లున్నను నిష్ఫలమే గదా. ాదాస్పదమైన బ్రహ్మ విచారణకు స్థానము లేదు అని ఆచార్యులు చెప్పిరి

అహంధియాత్మనః సిద్ధేస్తస్యైవ బ్రహ్మభావతః
తజ్జ్ఞానాన్ముక్త్యభావాచ్చ జిజ్ఞాసానావకల్పతే

ు, నేనను బుద్ధిచే ఆత్మ సిద్ధించుట వలన దానికి బ్రహ్మమను భావము ్ దాని జ్ఞానము వల్ల ముక్తి కలుగదు కాన జిజ్ఞాస చేయరాదు. అద్వితీ ుమైన బ్రహ్మమందు భిన్నముగా ఆరోపింపంబడిన దేహాదులు ఏవి భాసించు న్నవో వానికి అద్వితీయ బ్రహ్మ విచారణచే నివృత్తి గలుగును. అట్లు ుగా ఇందులో చెప్పిన అనుమానములో ఫలములేదను హేతువు అసిద్ధమగు ు భావము. వ్యాపకము అగ్ని నివర్తింపగా వ్యాప్యము ధూమము నివ ంచునను వ్యాప్యముచేత ధూమము అగ్నిని అట్లు అపేక్షించు చున్నది ము గ్రహింపకుండుటకు వ్యతిరేకమైన భేదసంస్కారము వ్యాపకమగు ్నలేనపుడు వ్యాప్యమగు ధూమము కూడ ఉదయింపక పోవలసి వచ్చును ్లు భేదాధ్యాసము భేదసంస్కారము నపేక్షించును. భేదసంస్కారము లే ండ భేదాధ్యాసము ఉదయింపదు. కాన భేదసంస్కారము భేదాగ్రహ ను నశింపజేయుచు భేదాధ్యాసను గలిగించును. ఈ దృశ్యమైనది రజ ము అనియట్లు కలుగు రజత సంస్కారము రజతాజ్ఞానమును నశింపజే యుచు, ఇది రజతమె అని ... యథార్థమైన రజత ప్రతీతి గాని, యదా ముగాని రజత ప్రతీతిగా గాని కలిగించును. రజత సంస్కారము కలు ు వానికి అట్టి ప్రతీతి కనిపించుట లేదు. సంస్కారమును యథార్థమైన నుభవము లేనిదే కలుగదు. భ్రాంతి రూపమైన అనుభవము దానికి ణమని చెప్పరాదు భ్రాంతి అభ్రాంతి పూర్వకముగాన ఒక చోటి మాణమును తప్పక అంగీకరింపవలసి యుండును గనుక ప్రయోగమును ్లు-విభిన్నములైన ఆత్మానాత్మల భేదముచేత ప్రమితలోని తమఃప్రకా ములు వలె అభేదమునకు అయోగ్యమగుటకు ఆత్మానాత్మలకు అభేదము

యుక్తముకాదను హేతువు ఎక్కువ సహింపదు గాన అసమర్థనుని శంకింప రాదు. వికల్పములను సహింపక పోవుటవల్ల. ఎట్లన ఆత్మానాత్మ పరిశేషము గాని అనాత్మాత్మ పరిశేషము గాని అగును. పరిశేషమనగా అంగము. తత్స్వ రూపము అందు లీనమగునని భావము. అవశేషము గాని ఆత్మా నాత్మలకు అభేద యోగ్యత ఉన్నచో అపుడు వానిలో భేదము అనగా ఒకటి యింకొక దానియందు నీటియందు ఉప్పువలె లీనమగుట. అదియు ఆత్మ యందు అనాత్మ కలయుటయా లేక అనాత్మయందు ఆత్మకలయికఅగుటయా? లేక వాస్తవమునకు ఆత్మగాని అనాత్మగాని ఒకటియే మిగిలి యుండును. ఆత్మ మిగిలి యుండునను మొదటి పక్షము ముత్యపు చిప్ప స్థితిలో వలె గనబడు జగత్తు ఆత్మలో అస్తమించును, అనాత్మమైన పదముచే ప్రకాశించు జడవర్గమే మిగులునను రెండవ పక్షములో జగత్తు అంధకారమగుట ప్రసక్త మగును చీకటి వెలుగులవలె అవి విరుద్ధ స్వభావము గలవి యగుట చేతను గూఢ దృగ్దృశ్యములైన ఆత్మానాత్మలకు అభేద యోగ్యము కాదని గ్రహింప వలెను. అందు వలన ఆత్మానాత్మలకు అభేదము యోగ్యము కాదు కనుక ఆత్మయందు ప్రపంచ రూపమైన అర్థము ఆరోపింప బడును. ప్రపంచము వాస్తవికవిషయమైనపుడు ఆత్మకు కలుగు తద్విషయక లౌకిక జ్ఞానము కూడ వాస్తవమె గనుక ఆత్మయందు జ్ఞానరూపము సంభవింపదు. ఇట్లు అర్థాధ్యాసము ఉపపన్నముగానపుడు అర్థాధ్యాస పూర్వకమైన జ్ఞానాధ్యాసము సంభవమగుట చేత బ్రహ్మ విచారణ అసంభవము గాన బ్రహ్మ విచారణకు అధ్యాస దేహాధ్యాస నివృత్తి ఫలము చెప్పుటకు శక్యము గాదని అఫలత్వము విచారణ రూపమైన నాలుగు లక్షణముల శారీరిక మీమాంస ఆరంభింప రాదని పూర్వపక్షము రాగా అపుడో సిద్ధాంతము ఇట్లు చెప్పబడుచున్నది.

నేను అను పదముచే గమ్యమైనదాని కంటె ఇంకొక ఆత్మతత్వము లేదని చెప్పరాదు. ఏ విధమైన యుపాధి లేని ఆత్మ తత్త్వమే శ్రుత్యాదు లందు ప్రసిద్ధమైయున్నది. వానికి లాక్షణి కార్థముచెప్పరాదు. అపుడు ఉప క్రమము ఉపసంహారము మొదలైన తాత్పర్య లింగములు ఆరు కలుగునట్లు తత్త్వమును బోధించు వాయ ప్రకరణార్థము నిర్ణయించుట ఉప పన్నము గాకపోవును. తాత్పర్యము నిర్ణయించు లింగములు ఆరని పూర్వా చార్యులు చెప్పిరి.

ఉపక్రమోప సంహారావభ్యాసోఽ పూర్వతా ఫలమ్
అర్థవాదోప పత్తీచ లింగం తాత్పర్య నిర్ణయే

అని ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వఫలము, అర్థవాదము, ఉపపత్తి అను అరును వాక్య తాత్పర్యమును నిర్ణయించు లింగము తత్రసదేవ సోమ్యేద మగ్రఆసీత్ అందు "సౌమ్యా ఈ షత్తి మొదట నుండెను అన్నది ఉపక్రమము ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం సఆత్మ తత్త్వమసి శ్వేత కేతో "ఇదంతయు ఆత్మకు సంభంధించునదే. అది సత్యము అది ఆత్మ శ్వేతకేత అది నీవై యున్నావు అన్నవి ఉపసంహారము. ఈరెండు బ్రహ్మ విషయములు ఒక రూపముగా నుండుట ఒక లింగము "తత్త్వమసి" అది నీవై యున్నావు మాటి మాటికి చెప్పుట అభ్యాసము. ఇతరప్రమాణము లచే గమ్యము కాకపోవుట అపూర్వత్వము. ఒకే విజ్ఞానముచే అన్ని విజ్ఞానములు కలుగుట ఫలము. పుష్టి సృష్టి స్థితి ప్రళయ ప్రవేశ నియమములు ఐదు అర్థవాదము. మట్టి మొదలగు దృష్టాంతములు, ఉపపత్తులు దాని వల్ల ఈ లింగముచే వేదాంతములు నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావము గల బ్రహ్మాత్మపరములుగ నిశ్చయింప వలసి యున్నది. ఇట్లు ఉపనిషత్తుయందలి అత్మతత్వము అనుభవములో భాసించక పోవుట వల్ల అయనుభవము అరోపింప బడిన ఆత్మవిషయుమని సిద్ధించునది.

కణాద గౌతములులోనగు వారు విషయముగా చేసుకున్న ఆత్మ భాసించక పోవుట వల్ల నేను అను అను భవమును ఆరోపింపబడిన ఆత్మవిషయముగా గ్రహింప దగినది మరి. నేనను ననుభవము సర్వగతమైన యాత్మగా దెలిసి కొనుటకు సమర్థమైనది కాదు. నేనే యింటిలో నున్నాను. అని స్వల్ప ప్రదేశము నందున్నట్టు గ్రహింప బడుటవల్ల ఇది దేహమునకు ఒక స్వల్ప ప్రదేశము నందున్న దనుటలో భాసించు చున్నదని తెలియరాదు. పుచు నేనని చెప్పుట కుదరదు, ఎట్లన రాజు యొక్క సర్వప్రయోజనము లు చేయు బృత్యుని యందు న యాత్మఈ భద్ర సేనుడు అని యుపచార ములుచెప్పినట్లు అత్మను చెప్పునేను పదమునకు దేహమందు ఉపచారమగు

నన్న చోసటనకుము ఉపచారముగా (గౌణముగా) చెప్పబడినట్టి ఆత్మ భావము గల దేహాదులకు భ్రమతో సమానమైన యాకారముగల రాతి బొమ్మ లోనగు నవి అచేతనములు అగుటవల్ల జ్ఞాతృత్వము కుదరదు. జ్ఞాతృత్వము కూడ ఉపచారముచే కల్పింప బడదు. అట్లు ప్రయోగింప బడిన వానికి స్వ ప్రతిపత్తిని ప్రకాశింపచేయు ప్రయోగమందు ప్రతిపత్త్రృత్వకల్పన ఉపపన్న ముగాదు కనుక దేహ ధర్మమైన ప్రాదేశికత్వము ఆత్మ యందు గల్పింప బడినచో అపుడు దేహాత్మలు భిన్నములు కావలసి వచ్చును. సింహము మావ వకుడు అన్నచోట ప్రసిద్ధ భేదములేదు తైలశబ్దము తిలల నూనె యర్థము లోనున్నను ఆవాలనూనె యను అర్థములో కూడ లక్షణముచే సిద్ధించుట చేభేదావ్యవస్థాయము నియతమగుటచే దేహాత్మలకు భిన్నత్వమె. మరి ఇది నా శరీరమని శరీరశరీరముల భేదము భాసించుట వలన గౌణముగా ఉదయించిన అభేదముఉన్నచో అది అపుడు యుక్తము గాదు. నేను అను శబ్దము దేహాదుల నుండి విడదీసి అసాధారణ ధర్మము కలుగు నట్లు భాసించక పోవుట వలన. అట్లు గానిచో దేహమే ఆత్మ యని అనుకోక పోయినచో చార్వాక మతమే ఉదయింపక పోవలసి వచ్చును. ఇది నాయొక్క శరీ ము అను వాక్య మైతే రాహువు యొక్క శిరసు అనుదాని వలె ఔపచా రిక మైనది. నాశరీరము అని పలుకు వానిచేత గూడ నీవు ఎవరవు అని అడుగగా గుండెమీద చేయి ఉంచుకొని కొమ్ము పట్టుకొని చెప్పినట్లు, ఈ నేను అని సమాధానముమ చెప్పబడుటచేత దేహాత్మకప్రత్యయము సకలానుభవ సిద్ధమై యున్నది అదియు చెప్పబడినది.

> దేహాత్మ ప్రత్యయో యద్వత్ ప్రమాణత్వేన కల్పితః
>
> లౌకికంత దివేవేదం ప్రమాణంత్వాత్మ నిశ్చయాత్॥

అట్లును వ్యాసకమైన భేద భావననివర్తించుచున్న వ్యాప్తమైన గౌణార్థము వివర్తించినది

భ్రమ నివృత్తి యైతే ఇది తాడేయను ప్రత్యక్షానుభవము చేతనే గలుగును. అట్లే ఇత్యధను ఇది భగవాడైన భాష్యకారునిచే "పశ్వాదిభిశ్చా విశేషాత్ (బ్ర. హ్మ సూ భా 1.1.1) పశువులు మొదలగు వానితో సమముగ బ్రహ్మ సాక్షాత్కారము పొందినవారి వ్యవహారము ఉన్నది. సుఖకారణము ఉన్నపుడు పశువు ప్రవర్తించును. దుఃఖ కారణము అనగా ఎవరైనను కొట్టబోయినపుడు పరుగెత్తును. అట్లే శాస్త్రచింత కోరువారు తమను గౌరవించు వారి చెంతకు నిర్భయముగా వెళ్లుటయు, కొట్టబోవు వారి నుండి మరలుటయును జరుగుచున్నది. కాన వ్యవహారముల యందు పశువువలె ప్రవర్తించుచున్నారు. భామతీకారులును ఇట్లే చెప్పిరి. శాస్త్ర చింత కోరువారు అట్లే చింతింతురు. ప్రతిపత్తి పొందినవారు మాత్ర ముట్లుకాదు. కనుక ఆత్మకుగోచరమైన అధ్యాత్మరూపము సుష్ఠుగా నుండును. జైనమతమును అనుసరించి నేనను జ్ఞానమునకు ప్రాముఖ్యము కొంతు దేహమెంతదో ఆత్మయును అంతదే అనియు అంగీకరించుట సరికాదు మధ్యమపరిణామము అవయవములు గలది కాన దేహాదులవలె ఆత్మయు నిత్యమన్నపుడు చేసిన కర్మకు ఫలము లేకపోవుటయు, చేయని కర్మకు ఫలమును కలుగవలసి వచ్చును, మరియూ దోషమును పరిహరించుకొనుటలో అవయవసముదాయమే ఆత్మయని అంగీకరింతమా! అప్పుడిట్లు చెప్పదగి యుండుట ఏ ప్రత్యేకావయవమునకు చైతన్యముండునా, చైతన్యసంఘాత మునకు చైతన్యముండునా అనిన మొదటిదికాదు. బాల చేతనములు నేను ముందు, నేనుముందని ప్రధానభావమును పొందనివారికి సామ రస్యము లేకపోవుటచేత ఒకేసారి ఒకటి ఒక వైపునకు, ఇంకొకటి ఇంకొక వైపునకు వెళ్ళుటచే శరీరము లేనిదానికి కూడా ఏదో ఒకదానికి నాశ నమొ ఎక్కడకును పోలేక నిర్వ్యాపారముగా నుండిపోవుటయో అగును ఒక జీవాత్మ తూర్పునకును ఇంకొకటి పడమరకును వెళ్ళుటచే ఒకటి ఒక వైపునకును వేరొకటి వేరొక వైపునకును లాగుటచే విడిపోవలసి వచ్చును. లేక రెండును ఎటులును వెళ్ళలేకపోవుటయో జరుగును. సం ఘాతమునకు అన్నపుడు సంఘాతముగా నగుట శరీరమును బట్టి వచ్చి

దా? స్వాభావికమా? లేక యాదృచ్ఛికమా? మొదటిదికాదు శరీరమనరాదు. క యవయవము భిన్నమైనపుడు చిదాత్మకు గూడ అవయవములు న్నమగును. అచేతనము కావలసి వచ్చును. చేతియందు గాని, కాలివ్రేలి యందుఁగాని అంతకంటెను సూక్ష్మమైన దానియందు గాని ఒక శరీరము న్నము కాఁగా అంతమాత్రమే యున్న జీవావయవము భిన్నము ఁగా జీవమే వినాశము కావలసి వచ్చును. అనేకావయవములకు అన్యోన్య సాహిత్యనియమము లేకపోవుటచే సంశ్లేష విశేషము స్వాభావికమన్నచో ప్పుడుఁగూడ స్వాభావికము నుండి జారిపడదు గాన స్వల్పావయవము కుఁగూడ ఎప్పుడును విశ్లేషము కలుగకపోవును. నియమముగా నున్న వయవములు ఎప్పుడును అట్లే యుండవలసి వచ్చును. కాని అవి అట్లు నిపించుట లేదు సంశ్లేషమువలె విశ్లేషము గూడా యాదృచ్ఛికమై ను సుఖముగానున్నది. హఠాత్తుగా అచేతనములు కావలసి వచ్చును. లావ్యవసా భేదముచే జన్మాంతరము చేతఁగాని అంతమాత్రమే జీవు డునా అన్న జైనులు అంగీకరింపరు గాన కానీ ఆత్మ అణుపరి మము గలదని యాశంకింపరాదు అపుడు స్థూలుడను పొడుగైనవాడను జ్ఞానము ఉపపన్నము గాదు.

విజ్ఞానమె ఆత్మయను వారికి దోషము పట్టదు. అపుడు జ్ఞానము కారము ను గాన అధ్యాత్మిక దేహాద్యాకారములు గలవాడను నేను అని తోచుచున్నది. అట్లుకాఁగా జీవాత్మ ప్రాదేశికము స్థూలము మొదలుగా తోచుట యెట్లు ఉపపన్నమగును గాన ప్రతీతితో అనుపపత్తి దోషము గాదు శుద్ధసావయవతత్త్వములు లేకపోవుట వల్ల అవి గణింపదగినది. శరీరావయవాదులను బట్టి దానికి భేదము ప్రసక్తము గాదు. విజ్ఞానమన్నది ప్రతిక్షణము భిన్నమగును. ఎప్పుడెట్లు శరీర సంస్థానమున్నదో అపుడు అట్టి ఆకారములు గల విజ్ఞానముండును. శరీరాద్యవయవ సదృశములైన యావిజ్ఞానావయవములు విశుద్ధములు కావు. శరీరాదులు మూర్తిగల పరమాణువుల సంఘాతము. అంతరమైన విజ్ఞానాదికమైతే స్కంధముల సంఘాతము అదియు కల్పనామయమైన స్వాప్నిక వస్తువులతో తుల్యమైనది

అందువల్ల దాని అవయవములు వేరుగా సిద్ధములుగావు. విరుద్ధత్వ మనగా ఇతరావయవములకు ఆధీనముగా కాని యుత్పత్త్యాదులు కలుగుట ఎవడు నిద్రించెనో అటువంటి నేను మేల్కొని యున్నాను అని స్థిరముగా కనిపించు నేను అను వాక్యమును క్షణభంగురమైన విజ్ఞానమునందు గోచరము కాఁగా అదికాదని యందు అది యను బుద్ధి అనే విధ్యాధ్యాస (ఆరోపము) అట్లే యుండిపోవునుగాబట్టి అనగా అస్థిరమందు స్థిరత్వ భ్రాంతి యందుట వల్ల అధ్యాసము వర్ణింపబడినదని భావము.

ఆ బౌద్ధులు విజ్ఞానమె ఆత్మయని యందురైనను అది యుక్తము కాదు. సంతానము కల (ప్రవాహముగల) దానికంటె సంతానము ప్రవాహమును అభిన్నమో భిన్నమో అను వికల్పములను సహింపదు కనుక దీనిచే కృశుఁడను వల్ల నివాఁడను. ఇత్యాది వస్తువులలో బుద్ధితో సామరస్యము చెప్పుటచే నిదిఔపచారికము అన్నది తిరస్కరింపబడినట్లే విజ్ఞానవాదులైన బౌద్ధవిశేషులు విజ్ఞానము కంటె ఏదైనను తత్త్వము లేదు అని తలతురు. బుద్ధిచే గ్రాహ్యగ్రాహ్యకాకారము కలదై తనతో సమానమైనట్టి ఆకారములు గల ఘటాది వస్తువులను తన్ను బట్టి భిన్నమైనవానిగా కల్పించును. కనుక స్థూలుడను నేను అను బుద్ధి ఔపచారిక మనివారందురు. అదియును దీనిచే నిరసింప బడినది. అది కొంత క్రితమే చెప్ప బడినది. అదియును ఇక్కడ సంభవము గాదు. వాస్తవికమైన విజ్ఞానాతిరిక్త పదార్థమును విజ్ఞానవాదులు అంగీకరింప లేరుకదా!

అట్లును ప్రయోగము కలదు. విషయ ప్రయోజనములతోఁగూడిన అనాద్య విద్యా మూలకమైన సంసార బంధనమును నివర్తింపఁజేయుట వలన విమతశాస్త్రము సుప్తోత్థితునికిఁగలుగు బోధవంటిది. ఎట్లన స్వప్నావస్థలు మాయచే పరికల్పింపబడిన స్త్రీజనాదులచేఁగలిగిన బాధనమును నివర్తింపజేయునట్టి సుప్తోత్థితబోధ మందిరమందు సుఖముగా పాన్పుమీదను పడియున్న దేహవిషయములు. అవి సుప్తబోధకృత నిశ్చయము లేని గనుక స్వప్నమాయచే విజృంభించిన (స్వప్నము లోచూచిన) అనర్థము

చున్న జ్ఞానమే ఆత్మయని బౌద్ధులు తెలుపుచున్నారు. దేహమంత పరిణామముగలది ఆత్మయని జైనులగు జినులు ప్రతిజ్ఞ చేయుచున్నారు. కర్తృత్వభోక్తృత్వాదులు గలిగి పరమేశ్వరుని కంటె వేరైనది జీవాత్మయని నైయాయికులు. ద్రవ్యబోధ స్వరూపమగునది ఆత్మయని ఆచార్యులనుచున్నారు. భోక్తయేకాని కర్తకాదని సాంఖ్యులు. చిద్రూపమై కర్తృత్వాదులు లేనిదై పరము కంటె భిన్నముకానిది ప్రత్యగాత్మయని ఔపనిషదులు. ఇట్లు ప్రసిద్ధమైన ధర్మమందు విశేషముగా విప్రతిపత్తి కలుగగా దాని విశేషమునందు బుధులకు గూడ సంశయము కలుగుచున్నది. కనుక సందేహము సంభవించుటచేత బ్రహ్మను జిజ్ఞాసింపవలసి యున్నదని తేలినది. ఇది ఈవిధముగ బ్రహ్మ విచారణ చేయదగియుండుట సంభవించుటచేత బ్రహ్మవిచారణ చేయు బ్రహ్మ మీమాంస అను శాస్త్రమారంభింపఁదగినదనుట యుక్తమై యున్నది. (జన్మాద్యస్యయతః, బ్ర. సూ 1-1-2) దేనివల్ల జన్మాదులు కలుగునో అదే బ్రహ్మ" అను మొదలుగా సర్వశాస్త్రము ఈ బ్రహ్మ విచారణమును అపేక్షించుట వలన శాస్త్ర ప్రథమాధ్యాయ సంగతము గలది ఈయధికరణము.

సరే ఇటువంటి బ్రహ్మమున్నదనుటలో ప్రమాణమేమి ప్రత్యక్షమా? అనుమానమా, ఆగమమా? ఆ బ్రహ్మము విషయములో ఎన్నటికి ప్రత్యక్షము క్రమింపలేదు. ఏలయన ప్రత్యక్షము ఇంద్రియములకు సంబంధించనిది. బ్రహ్మము అతీంద్రియము అను అనుమానముగాదు. వ్యాప్తమైన లింగము బ్రహ్మమునందు లేదు కనుక ఆగమము కాదు. "యతో వాచోని వర్తంతే అప్రాప్యమనసాసహ" (తై [illegible]-1-1) మనస్సుతోగూడ పొందక దేనినుండి వాక్కులు మరలిపోవుచున్నవో అను శ్రుతియె బ్రహ్మమును పొందలేదని నిషేధించుట వలన ఉపమానము మొదలైనవి పొందశక్యము గాని శంకగలవి. కాన ఉపమానములు నియతవిషయములగును కనుక బ్రహ్మ ఉన్నదనుటలో ఏ ప్రమాణము సంభవింపదు అన్నచో ఇట్లనరాదు ప్రత్యక్షాదులు సంభవింపక పోయినను ఆగమము ఉన్నది కదా! "యతో వాచో నివర్తంతే" అని బ్రహ్మము వాగ్గోచరము గానిదని నిషేధించినది

అధేయమైన ఫలము కలిగియుండక పోవుటచేత శ్రుతికి బ్రహ్మగోచరము కాదు. ప్రమితి యందు ఆత్మ తమ ఆకారమును సమర్పించుట వలన ప్రమేయమగును. అనగా శ్రుతి స్వయముగా స్ఫురణరూపమైన బ్రహ్మయందు స్ఫురణ రూపమైన ఫలమును కలిగించుటకు సమర్థమైనది కాదు. కనుక బ్రహ్మ శ్రుతికి గోచరము గాదు. దానికి జ్ఞానమందు స్వాకారమును సమర్పించుట వలన ప్రమేయాత్మమైతే నగును.

"న ప్రకాశ్యం ప్రమాణేన ప్రకాశో బ్రహ్మణః స్వయం
తజ్జన్యా వృత్తి భంగత్వాత్ ప్రమేయమితి గీయతే".

బ్రహ్మమునకు స్వయముగా ప్రకాశము ఉన్నది. కనుక అది ఇంకొక ప్రమాణముచే ప్రకాశింప దగినదిగాదు. కాని ప్రమాణముచే ఆవరణమునకు భంగము కలుగు చున్నది కనుక బ్రహ్మ ప్రమేయము అనబడు చున్నది. సిద్ధించిన యర్థమందు వేదము ప్రమాణము అని సిద్ధించినచో అపుడు ఈ నీ కోరిక తీరవచ్చును కాని మరి ప్రామాణ్య నిశ్చయమో శబ్దార్థము సంబంధము మీద ఆధారపడుచున్నది. శబ్దార్థమో పెద్దలవ్యవహారమును బట్టి ఉండును. పెద్దల వ్యవహారము లోకమునందు కార్యమొకదాని యందే నియతమై యుండును. గోవును తీసుకొని రమ్ము అను వాక్యమును విన్న పిదప గోవును తీసుకొని వచ్చుట జరుగుచున్నది. ఇక్కడ గోవును తీసుకొని రమ్ము అనునది ఒక గోవును. తీసుకొని రమ్ము అను విధాయక వాక్యము విన్నపిదప తీసుకొని వచ్చుట అను కార్యము బుద్ధి యందు ఉండుట. అపుడు కార్యములో వచ్చు క్రియ లోపల గల యర్థ సంబంధమును బాలుడు గ్రహించును. రాముడు రావణుని వధించెను. అన్న సిద్ధించిన వాక్యమువల్ల ఏ వ్యవహారమును ప్రబోధపడదు కనుక కాదు, అదియెట్లు ప్రమాణమగును అందుచే అట్టినవాక్యమువల్ల బాలునికిఅర్థ సంబంధ శక్తి కలుగదు. ఇట్లే సత్యము జ్ఞానము అనందము బ్రహ్మము ఇత్యాది సిద్ధబ్రహ్మమును బోధించు వాక్యములకు ప్రమాణములేదని భావము.

శబ్దములు కార్యార్థములను అనగా సిద్ధార్థములను ప్రతిపాదించునవి అయర్థమందు ప్రమాణము, శబ్దము కార్యార్థమందు శక్తి గ్రహణము చేత విరోధముండుట వలన సంభవింపదని భావము. అశ్వమందు సంగతిని గ్రహించిన అశ్వపదము గోవును చెప్పదు అందు ప్రామాణ్యమును గాని పొందదు. అందువల్ల కార్యమందు సంగతిని గ్రహించిన శబ్దములకు కార్యమె ప్రమాణమును. మరి ముఖము వికసించి యున్నపుడు వికాసము నకు హేతువైన ప్రసిద్ధమగు సంగతిని ఊహించి 'ఎక్కడైతే' నీకొక పుత్రుడు పుట్టెను ఇత్యాదులయందు సంగతి గ్రహము కలుగునో అక్కడ అవశ్యము కార్యము లేకుండగనే శబ్దమునకు సిద్ధార్థమందు ప్రామాణ్య మున్నట్లు ఆశ్రయింపబడు చున్నదిగదా? అప్పుడొకప్పుడు సిద్ధవాక్యము వల్లకూడ శక్తి గ్రహము పుట్టుచున్నది కదా? అన్నచో ఇట్లనరాదు. చైత్ర నీకొక పుత్రుడు పుట్టెను అని సిద్ధమైన అర్థమును తెలుపుచు చైత్రుని ఉపదేశించి దేవదత్తునిచేఁజెప్పు వాక్యమును విని చైత్రుని ముఖము వికసించుచున్నది. అలింగముచేత 'నీకు ఒక పుత్రుడు పుట్టెనని పుత్ర జన్మరూప వాక్యార్థమును సరిగాఁదెలిసికొనగోరి దేవదత్తుడు నిర్ణయించు కొనెను. ముఖవిలాసము ధనప్రాప్తివల్లకూడ గలుగును కదా! పుత్రుడు కలిగెనని దేవదత్తునికి నిశ్చయమైన దనరాదు. ప్రసవింప సిద్ధముగా నున్న చైత్రుని భార్య గురించి ఎరింగిన దేవదత్తునికి చైత్రునికి పుత్రుడు కలిగెనని నిశ్చయము ముఖవికాసము బట్టి సంభవించుచున్నది గాదా! కనుక సిద్ధవాక్యమును బట్టికూడ శక్తి గ్రహణము సంభవించు చున్నది. కాన పెద్దలవాక్యమునకు ప్రాముఖ్యములేదన రాదని భావము. కాని పుత్రజన్మ వలెనే ప్రియాసుఖప్రసవాదులైనఅనేక సంతోష హేతువులు సంభవించుచున్నవి గాన పరిశేష న్యాయమును నిశ్చయముగా ఉపపన్నము గాదు. నీకు పుత్రుడు కలిగెను ఇత్యాది సిద్ధార్థవాక ప్రయోగములయందు తలుపు, తలుపు ఇత్యాదుల యందు 'తీయుట'. ఇత్యాది కార్యములు అధ్యాహరించినట్లు కార్యమును అధ్యాహరించుట ద్వారా ప్రయోగము ఉపపన్నమగుచున్నది కూడా, శాస్త్రత్వ ప్రసిద్ధిచేత కూడ

వేదాంతవాక్యములతో సిద్ధార్ధపరమగును. ప్రవృత్తి నివృత్తి పరములగు వాక్యములే శాస్త్రములని ప్రసిద్ధి గలదుగదా! అదిభట్టాచార్యులిట్లు చెప్పిరి.

"ప్రవృత్తిర్వా నివృత్తిర్వానిత్యేన కృతకేనవా
పుంసాంయేనోపదిశ్యేత తచ్ఛాస్త్రమభిధీయతే"

ప్రవృత్తినిగాని, నివృత్తినిగాని నిత్యమైన ఏ వేదము చేతను కృత్రిమమైన ఏశాస్త్రాదికముచేతను, పురుషులకు ఉపదేశించునో అవి శాస్త్రమనబడును, సర్వము జ్ఞానము అనంతము బ్రహ్మ అనునవి వస్తుసిద్ధాంతమును తెలుపునవి గాన వీనికి ఏధమైన ప్రయోజనము లేదు. వేదాంతార్ధమును విన్న పురుషునికి సంసార ధర్మములనుండి నివృత్తి గలుగుట లేదు. కనుక వేదాంతములకు గూడ 'ఆత్మ తెలియదగినది' అని చెప్పువిధి వాక్యములో ఏకవాక్యతను ఆశ్రయించి కర్తవ్య బుద్ధియే ఆశ్రయింప దగునని తేలినది. కనుక కేవలము స్వసిద్ధముగానున్న బ్రహ్మయందు వేదాంతములకు ప్రాముఖ్యము సిద్ధింపదన్నచో ఇట్టివానికి ప్రతివిధానము చెప్పబడుచున్నది ఏదో అంతమాత్రము సిద్ధింపగా వ్యుత్పత్తి సిద్ధిగాదు. ఇదివరలో చెప్పబడిన దానిని బట్టి "నీకు పుత్రుడు పుట్టెను" అను సిద్ధపరమైన వాక్యము వల్ల వ్యుత్పత్తి సిద్ధించుచున్నది గదా! పరిశేష న్యాయమును బట్టి అవధారణ ముపపన్నము కాగా ప్రయోసుఖప్రసవాదుల వంగూడ సంభవించుచుండుటవల్ల అని అనరాదు. కొమారుని కాలిగుర్తులుగల వస్త్రమును చూపుటవలె ప్రియాసుఖప్రసవాదుల సూచకము లేకపోవుటవల్ల, పుత్రజన్మయే దానికి సూచకమన్నచో ముందు తెలిసిన పుత్రజన్మను వదిలినపుడు కారణము లేకపోవుచున్నది. కాన పుత్రజన్మయే అధిక ఆనందమునకు హేతువగుట వల్ల

"పుత్రోత్పత్తి విపత్తిభ్యాంనాపరంసుఖదుఃఖయోః
పుత్రోత్పత్తికంటె సుఖమును పుత్రవిపత్తికంటె దుఃఖమును ఇంకొకటి లేదు. అని అన్నది గదా! అట్లునుచితున్రభాచార్యులు చెప్పిరి.

"దుష్టచైత్రసుతాత్పత్తేస్తత్పదాంకితవాససా

వార్తాహారేణయా, తస్యపరిశేషవినిశ్చితే: (చిత్సుఖ:పుట 88) చూచిన చైత్రసుతోత్పత్తిని బట్టి ఆ పుత్రుని కాలిగుర్తులు గల వస్త్రములు గలిగిన వార్తాహరునితో వెళ్ళిన దేవదత్తునికి పరిశేషన్యాయముచే పుత్రోత్పత్తి నిశ్చయముగా గలుగుట వలన సిద్ధార్థ పరమైన దానియందు కార్యము అధ్యాహరించుటచే యువలెనని చెప్పినది యుక్తముగాదు.

ముఖ్యార్థ విషయముగా ప్రయోగము ఉపపన్నమగుచుండగా అధ్యాహారము అనుచితముగదా, శాస్త్రత్వ ప్రసిద్ధిచేత కూడ స్వరూపపరత్వము లేదన్నదియు అయుక్తమె. హితమును శాసించుటవల్లఁగూడ శాస్త్రత్వము ఉపపన్నమగునను ప్రయోజనము లేదు అనరాదు. విని మననము చేసిన వేదాంతములవల్లఁగలిగిన అద్వితీయమైన ఆత్మవిజ్ఞానముయొక్క అభ్యాసము చేత విచ్ఛేదములుగఁగా సంసారములకు మూలమైన అవిద్య నివర్తింపగా స్పష్టముగాఁదెలిసిన బ్రహ్మతత్త్వమె లక్షణము ముఖ్యముగాఁగల పురుషార్థము అపుడు సిద్ధించుచున్నదిగదా? ఇందుకూడ బ్రహ్మను తెలుపు వేదాంత వాక్యమందు వికల్పములు సహింపదుగాన విధి సంభవింపదని భావము. పరోక్షరి శబ్దజ్ఞానము విధేయమా? లేక భావనాత్మకమా? లేక సాక్షాత్కార రూపమా? మొదటిది కాదు. పదార్థసంగతిని దెలిసి శబ్ద, వ్యాకరణ, న్యాయ మీమాంస, తత్త్వము తెలిసిన వారికి విధిలేకుండగనే శబ్దము వల్లనే ఉపపత్తి కలుగుచున్నది కనుక. రెండవవాదమునుగాదు. మాటిమాటికి చింతించుట రూపమైన భావమువల్ల జ్ఞాన ప్రకర్షకు హేతువైన భావము అన్వయ వ్యతిరేకములచేత సిద్ధించుటచేత భావన ప్రాప్తించుటచే విధికి అపేక్ష లేదు గనుక ఎట్లు నిప్పుదగ్గర శైత్యబాధ పోవునో నిప్పు దగ్గర లేనిచో శైత్యబాధ నివర్తింపదో అట్లువిధిద్వారన ఉన్నపుడు జ్ఞానము వర్ధిల్లును. కనుక దానికై విధికి అపేక్షలేదు. విధిలేకున్నను భావన ప్రాప్తించుచున్నది కాన ప్రాప్తించిన దానిని పొందుటకే గదా! విధి అంగీకరింపవలసి యుండును.

ఇంక మూడవ పక్షమున సాక్షాత్కారము అనగా బ్రహ్మస్వరూప సాక్షాత్కారము లేక అంతఃకరణ పరిణామరూప సాక్షాత్కారము. బ్రహ్మ సాక్షా

త్కారము నిత్యము కనుక చేయదగిన విధేయము చేయరాని శశశృంగము వలె ఎల్లప్పుడును చేయరానిదే అన్నది విధింపదగినది కాదు. తెలియ దగ్గది జ్ఞాతత్వము ఇత్యాదులు అవిధాయకములు అగుటచేత తగిన అను నర్థములో తవ్యాది కృత్య ప్రత్యయములు తృచ ప్రత్యయము విధింప బడుటచే తవ్యార్థమె తగినది అను అర్థమే వివరింప దగినది కనుక అన్ని వేదాంత వాక్యములలో ఉపక్రమోపసంహారాదులు గల ఆరు విధములైన తాత్పర్యములతో గూడినవి కాక నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావములు గల బ్రహ్మాత్మత్వ పరముగా ఉండదగినవి.

అవయవములు లేని పరమాణులయందు అవయవములున్నట్లు సమ్మతమగు సంయోగము ఉపపాదింప శక్యముగాక పోవుటచే వానిని బట్టి ద్వ్యణుకము సిద్ధింపకపోగా ద్వ్యణుకము త్ర్యణుకముగా క్రమముగా ఆరంభవాదము సంభవింపదుగాన అచేతనమగు ప్రకృతి మహత్త్వాది రూపముగా పరిణామవాదము సంభవించక పోవుట వలన ఖ్యాతిఖాదయును ఇంకొక రీతిగా ఉపపన్నము కాకపోవుట వలన అనిర్వచనీయమైన ప్రపంచము చిత్తునకు వివర్తమె అని సిద్ధించునది. తనరూపమును విడువక శుక్తి తన రూపమును విడువక రజతముగా చేసికొనుచు ఇంకొక రూపము పొందినట్లు కనబడుటయె వివర్తమని సత్య (ఆత్మ), అహంకార ప్రపంచ మిథ్యారూపమై అవభాసమే అగును) శుక్తియందు రజతధ్యాస అవభాస అన్నను అధ్యాసమన్నను ఒకటే. ఆత్మయందు ఆత్మకాని మిధ్యయైన అహంకారముల స్వరూపమును ఆభాసించుట మిథ్యాధ్యాస అనబడును.

ఆయధ్యాస రెండు విధములు. అర్థాధ్యాస జ్ఞానధ్యాస అని శుక్తియందు మిధ్యమైన రజతాధ్యస అర్థాధ్యాస అని శుక్తియందు మిధ్యమైన రజతా ధ్యాస అర్థాధ్యాస, మిథ్యాజ్ఞానమునకు ఆత్మయందు అధ్యాస జ్ఞానాధ్యాస అని యిట్లు చెప్పబడెను.

ప్రమాణ దోష సంస్కార జన్మాన్యస్య పరాత్మతా తద్ధీశ్చాధ్యాస ఇతి హ్యద్వయ మిష్టం మనీషిభిః" ప్రమాణము దోషము సంస్కారము ఈ మూడింటి వలన గలిగిన అన్యయమునకు పరాత్మత అనగా వస్త్వంతర స్వరూపమును తాదృశ వస్తు జ్ఞానమును అధ్యాస అని రెండు రకములని పేమంతుల ఆశయము. ప్రమాణము ప్రత్యక్షము దోషము దూరత్వాదులు. ఇది వరకు రజతముగా అనుభవము వల్ల ఆత్మయందు గలిగిన సంస్కారమని మూడు కలవు. శుక్తియందు ఇది రజతమను భ్రమ కలిగినది ఇది ప్రసిద్ధమే. అదియును రెండు విధములు. నిరుపాధికము సోపాధికము అని అదియును ఇట్లు చెప్పబడినది.

"దోషేణ కర్మణావాపి క్షోభితాజ్ఞాన సంభవః
తత్త్వ విద్యావిరోధీచ భ్రమోయం నిరుపాధికః

దోషముచేత గాని కర్మచేత గాని క్షోభితాజ్ఞాన సంభవమైన తత్త్వ విద్యావిరోధములైన భ్రమ నిరుపాధికము. ఆత్మయందు అహంకారాధ్యాసము నిరుపాధికము. ఎట్లు ఉపహితము కాని ఇద మంశమందు రజత సంస్కార సహితా విద్యచే రజతాధ్యాస కల్గునో అట్లు పూర్వాహంకారాది దోషముచే గాని కర్మచేతగాని క్షోభపెట్టబడిన అవిద్యచే చిద్రూపమైన ఆత్మ ఉపహితము కాకపోంగ అహంకారాధ్యాస కలుగును. ఒకే బ్రహ్మము ఉపహితము కాంగ జీవేశ్వరరూపముగా భేదాధ్యాస సోపాధిక భ్రమము. ఆత్మయందు అహంకారాధ్యాసయు నిరుపాధిక భ్రమ. ఇది ఇట్లు చెప్పబడినది.

ఉపాధిసంనిధిప్రాప్త క్షోభావిద్యా విజృంభితమ్
ఉపాధ్యపగమాపోహ్యమాహుః సోపాధిక భ్రమమ్

ఉపాధి దగ్గర కలిగిన క్షోభవల్లంగలిగిన అవిద్యావిజృంభితమైన ఉపాధి లేకపోవుటచే నపోహ్యమైన దానిని సోపాధికభ్రమ అందురు. అందు స్వరూపముగా కల్పించిన అహమధ్యాస నిరుపాధికము. అదియు చెప్పబడినది.

"నీలిమేవ వియత్యేషా భ్రాంత్యా బ్రహ్మణి సంసృతిః
ఘటవ్యోమేవ భోక్తాయం భ్రాంతో భేదేననస్వతః"

ఆకాశమునందు నీలిమవలె బ్రహ్మమందు భ్రాంతిచే సంసారమను బుద్ధి కలుగుచున్నది. విశాలాకాశము బ్రహ్మము ఘటాకాశమువలె వీడుభోక్త అనునది భ్రాంతము ఇది భేదములచే గాని స్వయముగా గాదు. కనుకనే భాష్యకారుడు శంకరుడు. "శుక్తి రజతమువలె భాసించుచున్నది." ఒకే చంద్రుడు రెండు చంద్రులుగా తోచునట్లు అను రెండు ఉదాహరణలు ఉదాహరించెను. మిగిలినది శాస్త్రమునందె చూడందగును. విస్తరమగు భీతిచే ముగించంబడుచున్నది. ఇట్లును దృక్కుదృశ్యము అను రెండే పదార్థములని వేదాంతుల సిద్ధాంతము. ఇట్లు సర్వము అనవద్యము. ఇక్కడ ప్రభాకరుండు:–

ముత్యపుజిప్ప వెండివలె భాసించుచున్నది. అను దృష్టాంతము మాకిష్టము కాదు. రజతజ్ఞానమునకు ముత్యపుజిప్ప ఆధారమగుట ఉపపన్నమగుట లేదు కాన. శుక్తియందు కలుగు "ఇది రజతము" అను జ్ఞానము భ్రమకాదు యథార్థమే. అదియు ఒకే జ్ఞానము కాదు. ఇది అన్నది ప్రత్యక్ష జ్ఞానము. రజతమన్నదైతే ఇదివరలో చూచిన రజతమును జ్ఞప్తి తెచ్చుటచే గలిగిన ఆకార దర్శనము. అక్కడ ప్రత్యక్షముగా నెదుటనున్న వస్తువు మాత్రమే గ్రహింపబడును. దోషవశము వలన అవస్తువునందున్న శుక్తిని గ్రహింపదు. ఆ గ్రహించునది రజతముతో సమానముగా నుండుటచే రజత సంస్కారము ఉద్భోదించు క్రమముగా రజతస్మరణను దెచ్చును. అదియు "అది గ్రహించబడినది" యని యిట్లు గ్రహించబడినది అను స్వభావము గలదైనను దోషవశము వలన గ్రహింపబడి యంశను దీసి వేయుటవలన గ్రహించుట మాత్రమే యుండును. దీనినే తత్త్వాంశ ప్రమోషమందురు. అట్లును ప్రత్యక్షము స్మరణము అను జ్ఞానద్వయము అన్యోన్యము స్వరూపములను బట్టి, విషయమును బట్టి భేదమును గ్రహించక పోవుటవల్ల వాస్తవమునకు భిన్నమైనను జ్ఞానద్వయమైన ఇదిరజతము అను అభేద

వ్యవహారమును కలిగించును. రజతముకోరు వానికి ప్రవృత్తియైతే ముందున్న పదార్థమునందు ఇదిరజతము కాదు అని యిట్లు భేదజ్ఞానమును తెలియక పోవుటవలన అగుచున్నదని తలచును. రజతజ్ఞానమును శుక్తి విషయముగ సంభవింపదని భావము. ఎపుడైనను ఘటజ్ఞానము పటవిషయిక ముగ కాగల్గునా. ఇది రజతము అను ప్రతీతిలో శుక్తిని ఆధారముగ గ్రహించుట ముందున్నంత మాత్రముచే ఆలంబనము కారణమగుట చేతనా? భాసించుట చేతనా? మొదటిది కాదు. ఏలయన ముందున్న మట్టిబెడ్డ మొదలైనవి కూడ ఆలంబనములు కావలసివచ్చును.

మరి రజతము బోధించు సంస్కారమును ఉద్బోధించు కారణముగా దాని ద్వారా రజత జ్ఞాన కారణముగ ఆలంబనము ఆధారమని తలచుచున్నావా? శుక్తి రజత జ్ఞాన విషయమనితలచుచున్నావా? అదియు సరిపడదు. చక్షురాదులు కూడ అందు కారణమగుట చేత విషయములు కావలసి వచ్చును గదా! శుక్తి విషయమైనచో శుక్తియే అనుభవింప బడును. రజతము భాసించుటచే విషయమును కాదు. మరి భాసించుటచే విషయమును ఇష్ట పడుచున్నావా? అదియు యుక్తముకాదు. రజతనిర్భాస శుక్తికి ఆలంబ మగుట ఉపపన్నము అగుట లేదు. మరియు ఏ విజ్ఞానమందు ఏది భాసించునో అది దానికి ఆధారము. ఇక్కడను వెండియనుభవము శుక్తికి ఆలంబనమని కల్పించుటలో విరోధించును. అట్లును ప్రకరణ సంచికలోని నాల్గవ ప్రకరణము లో న్యాయవీథిలో శాలికనాథుడు అనెను.

"అత్ర బ్రూమో యఏవార్థో యస్యాంసంవిది భాసతే
వేద్యఃసఏవనాన్యద్ధి వేద్యావేద్యత్వ లక్షణమ్"

ఇందులో ఇట్లు చెప్పబడినది. ఏ జ్ఞానమందు ఏ పదార్థమైతే భాసించునో అదే తెలియందగినది ఇంకొకటి వేద్యావేద్యత్వమునకు లక్షణము కాదు.

"ఇదంరజతమిత్యత్ర రజతంత్వవభాసతే
తదేవతేనవేద్యంస్యా న్నతుశుక్తిరవేదనాత్"

ఇది రజతమన్నచోట ఇది రజతమనియైతే భాసించుచున్నది. దానిచే అదే వేద్యమగును గాని తెలియకపోవుటవలన ఇది శుక్తిఅని కాదు.

"తేనాన్యస్యాన్యథాభాసః ప్రతీత్యైవ పరాహతః
అన్యస్మిన్ భాసమానేహి న పరంభాసతేయతః"

అందుచే ఒకటి యింకొకటిగా భాసించుట ప్రతీతచేతనే తిరస్కరింపఁబడినది. ఇంకొకటి భాసించుచుండగా ఎందువల్ల వేరొకటి భాసింపదో (ప్రక.వ. 4–13–25) అనగా శుక్తియందు ఇది రజతము అని భాసించునపుడు శుక్తి జ్ఞానము భాసించుట లేదుకదా! అదే భ్రాంతిచేగానిండు, దేనిచేఁగానిండు ఒకటి భాసించునపుడు రెండవది భాసింపదు. రెండు జ్ఞానములున్నవఁగదా! ఒకటి సత్యము రెండవది భ్రమ అనుకొనుటకు. ఆ భ్రమయే సత్యముగ తోచుచున్నది గాన రెండవది లేదు. ఇంక స్మరణ తెచ్చుకొన్నప్పుడు ఇది శుక్తియనియు ఇది రజతమని జ్ఞానము ఎట్లు రెండు విధములుగకలుగును, రెండు జ్ఞానములు లేవను రహస్యమును గ్రహింపవలెను.

మరియు భ్రమాత్మక జ్ఞానము కలుగుటకు సామగ్రి లేదు. దానికి కేవలేంద్రియములు కారణములా లేక కార్యోత్పాదన సామర్థ్యమును కలిగి యుండకదోష దూషితములగు కారణములా? మొదటిది కాదు అవి సరియగు జ్ఞానము గలిగించుటలో సామర్థ్యమును పొందినవి గనుక ప్రతిబంధక ములు గావు. అపూర్వశక్తిని గలిగించునవియు గావు. అట్లన్నచో సరియైన రజత జ్ఞానము ఎప్పుడును ఉదయింపనే ఉదయింపదు. ఇంక రెండవదియు గాదు. దోషములు ఔత్సర్గిక కార్యోత్పాదకశక్తికి ప్రతిబంధకములు మాత్రమే ప్రభావముగ కలవి గాన, దుష్టమైన కుటజబీజము వటాంకురములను పుట్టింప లేదు గదా! తైలముతో కలుషితమైన శాలిబీజము మరి శాలికంటె ఇతర మైన మొక్కను పుట్టింప జాలదుగూడ. కాని తన కార్యమును చేయదు. సరేకాని దావాగ్నిచే దగులఁబడిన పేకుబెత్తపు గింజ అరటిబోదెను పుట్టించు నట్లు కనబడుచున్నదే (దావాగ్నిదగ్ధనేత్రబీజము కదళీకాండమును పుట్టించు

షని వనౌషధివిదులు) అన్నచో అదియు యుక్తము కాదు. అతగులంజడి నది వేత్ర బీజము కాకపోవుటచేత దోషములు విపరీతకార్యములను చేయుటను గూర్చి ఉదాహరణము కాదు. కనుక భస్మకరోగ దోషములచే పాడైన జఠరాగ్ని చాలయాహారమును పక్వముచేయంగలుగుటచూడబడినదేఅనియును అనరాదు.

భక్ష్యపానాది వ్యవహారములను జీర్ణము చేయుటకు జఠరాగ్నికి శక్తి యున్నది కనుక. అదియు చెప్పబడినది

"అయథార్థస్యబోధస్యనోత్పత్తావస్తికారణమ్
దోషాశ్చేన్నహి దోషాణాం కార్యశక్తివిఘాతతా"

యథార్థము కాని బోధ కలుగుటలో కారణమును లేదు. దోషములు అందు కారణమగునన్నచో అది సంభవింపదు. దోషము కార్యసిద్ధిలో ప్రతిబంధకములేకాని అపూర్వశక్తిని కలిగింపలేవు. జఠరాగ్నికి రక్తాద్యుత్పాదనశక్తి స్వభావమె

"భస్మకాదిషుకార్యస్యవిఘాతాదేవదోషతా
అగ్నేర్హిరసనిష్పత్తిఃకార్యంజఠరవర్తినః (ప్ర.కా.ప్ర 4-73-74)

భస్మకాది రోగవిశేషములు కార్యమునకు విఘాతము కల్గించుట వల్లనే అవి దోషములయ్యెను. జఠరములోనున్నఅగ్ని రసమును పుట్టించుటలో కార్యమె. మరియు రజతాదులు లేనపుడు రజతజ్ఞానము కలుగునని అంగీకరించినపుడు తగిన స్థలమునందుకూడ జ్ఞానములు విశేషము లేనపుడు గూడ కలుగుటవలన వ్యభిచార శంక మొలచుట సంభవించుటచే నిరంకుశ వ్యవహారములు లోపించును. అదియే చెప్పబడినది.

"యదిచార్థం పరిత్యజ్యకాచిద్బుద్ధిః ప్రకాశతే'
వ్యభిచారవతిస్వార్థే కథం విశ్వాసకారణమ్" (ప్ర.క.ప్ర-4-61)

రజతాది వస్తువులను విడచి యొకానొక బుద్ధి అటువంటి జ్ఞానము కలిగినచో వ్యభిచారముగల రజతాది వస్తువులయందు విశ్వాస కారణము ఎట్లు కలుగును. కనుక లేని రజతము ప్రత్యక్ష జ్ఞానవిషయము కాదు కనుక.

వస్తుమాత్ర ప్రత్యక్షము రజతస్మరణమును గూడ అను రెండు జ్ఞానములు అంగీకరింపవలెను. రజతాదివిషయమైన ఒకే విశిష్ట జ్ఞానము మాత్రము కాదని దాని ఆశయము.

సరే మరి రజతమందు ఒకే విశిష్టజ్ఞానమును అంగీకరించినపుడు విశిష్ట వ్యవహారమును సిద్ధింపదే. కనుక దాని సిద్ధికై విపర్యయము అంగీకరింపవలెనన్నచో అదిసరికాదు. ఇది రజతమని గ్రహణస్మరణల రూపమైన రెండు బోధలకు వ్యవహార కారణత్వములను అంగీకరించుటవలన ఇది యిట్లయినచో ఇది శుక్తికాఖండము అది రజతము అను దీనికంటె విశిష్టమైన వ్యవహారము కలుగును. అది సరికాదు. అక్కడ ఇదిముందున్న ద్రవ్యమాత్రమును గ్రహించుట దోషదూషిత నేత్రములనుండి పుట్టుటచేత శుక్తిగా గ్రహింపకపోవుట జరుగును, శుక్తిది ఇది అని సామాన్యరూపముగానే గ్రహణము జరుగును. రజతజ్ఞానమైతే ప్రత్యక్షము కాదు. దానికి విషయమైన రజతము దగ్గరగా లేకపోవుట వలన సంయోగము లేదు. రజతవ్యాప్తి లింగము అక్కడ కనిపించకపోవుట వలన అనుమితియు కాదు. ఇంక స్మరణ మొకటి కలుగుట వలనను రజతముతో సమానమైన వస్తువును చూచుటచేతఁగలిగిన రజత సంస్కారము మాత్రమునే చేత కలుగుచున్నది. చివరకు కలిగిన స్మృతి భావము దోషమునకు హేతువగుటచేత గ్రహింపబడిన తత్తాంశ లేకపోవుటవలన గ్రహణ మాత్రముననే ఉపపన్నమగుచున్నది. అదియును చెప్పబడినది.

"నన్వత్రరజతాభాసఃకథమేషఘటిష్యతే'
ఉచ్యతేశుక్తిశకలంగృహీతంభేదవర్జితమ్"

ఇక్కడ రజతము లేకపోవుటవల్ల రజతాభాస ఎట్లుకుదురును అంటె చెప్పబడుచున్నది. భేదములేని శుక్తియొక్క ముక్క గ్రహింపబడినది.

"శుయాకావిక్తిశేషాయేరజతాద్భేదహేతవః
తే న జ్ఞాతాఅభిభవాతజ్ఞాతాసామాన్యరూపతా"

ుక్తికలో రజతముకంటె భేదమునకు హేతువులైన ఏవిశేషములున్నవో అవి
జతజ్ఞానము తిరస్కృతము అగుటవల్ల తెలియబడుటలేదు కాని సామాన్య
ూపము తెలియబడినది.

"అనంతరంచ రజతస్మృతిర్జాతాతయాపిచ"
మనోదోషాత్తదిత్యంశపరామర్శవివర్జితమ్
రజతంవిషయీకృత్యసైవశుక్తేర్వివేచితమ్
స్మృత్యాతో రజతాభాసఉపపన్నోభవిష్యతి"

(ప్ర క ప 4-26-29)
వప రజతస్మృతి కలిగినను మనోదోషమువల్ల అది ఇది యను అంశ
ుుక్క పరామర్శలేని రజతమను విషయముగ జేసికొని వ్యవస్థ చేయబడి
ది. శుక్తికి వివేచన చేయబడనే లేదు. కనుక స్మరణవలన రజతాభాస
ఉపపన్న మగుచున్నది.

నహ్యపంనిహితంతావత్ప్రత్యక్షంరజతంభవేత్
లింగాద్యభావాచ్చాన్యప్యప్రమాణస్యనగోచరః
పరిశేషాత్స్మృతిరితిస్సిశ్చయోజాయతేపునః"

ప క ప 14-31-32) దగ్గరగా లేనపుడు రజతము ప్రత్యక్షము కాదు.
నుమానాదులు లేకపోవుట వలన ఇంకొక ప్రమాణమునకు గోచరము కాదు.
ుకమిగిలినది స్మరణ అని నిశ్చయము కలుగుచున్నది.

సరే మరి ఇది ఒక్కొక్కటె వ్యవహారమునకు కారణమా? లేక కలిసియా?
ుదటిది కాదు. దేశభేదములను బట్టి ప్రవృత్తి కలుగునని చెప్పవలసివచ్చును.
రెండియు కాదు. ప్రయత్నాయౌగపద్యాత్ జ్ఞానాయౌగపద్యాత్ (వై శే సూ
3-3) ప్రయత్నము ఒకసారి కలుగకపోవుట వలన ఈవిధముగా ఒకేసారి
ిగినను దానిని నిషేధించుటవలన జ్ఞానద్వయమునకు హేతువు అన్నది
ుక్తము కాదు. యుక్తమన్నచో ఇట్లనకుము. నశింపనివి కూడ ఉండుటను
ిషేధించినను నశించుచు నశింపకుండ నుండు రెండు జ్ఞానములుకూడ ఒకే
ి ఉండుటను నిషేధింపకుండుటచేత నిరంతరము పుట్టు జ్ఞానములుండుట

ఉపపన్నమగుచున్నదికనుక. ఇది రజతమన్నచోట గ్రహణ స్మరణ రూప జ్ఞానములు రెండింటిలో ఒకటి మొదటి క్షణములో పుట్టును. రెండవది రెండవ క్షణములో పుట్టునది. ఈరెండును కలసి మూడవక్షణములో కార్యమును చేయునని చెప్పవీలగును. అందు మొదటిక్షణములో పుట్టి నశించు స్థలములో ఉండి రెండవక్షణములో పుట్టినది నశింపని స్థితిలో నుండెనని తెలియదగును. ఓయిమరి రజతజ్ఞానమును కోరువాడు రజతమునకై ప్రవర్తించును గాక. ముందున్న వస్తువు విషయమైనను వాటిప్రవృత్తి ఎట్లుకలుగును అన్నచో అట్లనరాదు. స్వారూప్యమునుబట్టి వాస్తవమునకు అభిన్నములె.

"తథాపిభిన్నే నాభాతేభేదగ్రహణతత్త్వతః
సమ్యగ్రజతబోధస్తుసమక్షైకార్థగోచరః"

భిన్నములైనను భేదమును గ్రహింపని సామ్యమువలన అభిన్నమైనవివలె కార్యకారులగును. సరియైన రజతబోధ అయితే సమ్యగ్దృష్టికి మాత్రమే గోచరమగును.

"తతోభిన్నే అబుద్ధ్వాచగ్రహణస్మరణే ఇమే
సమానేనైవరూపేణకేవలంమన్యతేజనః
అవరోక్షావభాసేనసమానార్థగ్రహణేనచ

పిదప గ్రహణ స్మరణములు భిన్నములని తెలియక వీనిని కేవలము ప్రత్యక్ష భాసచేతను సమానార్థగ్రహణము చేతను సమానరూపముగానే జనము గ్రహించును.

"అవైలక్షణ్యసంవిత్తిరితితావత్సమర్థితా
వ్యవహారోపితత్తుల్యస్తత ఏవప్రవర్తతే"

విలక్షణముగా కనిపించని జ్ఞానముగానపుడు సమర్థించబడెను. వ్యవహారము కూడ దానికి తుల్యమె. అది దానివల్లనే ప్రవర్తించును. ఇట్లు అన్యోన్య భేదరూపవివేకము దేనిచే గ్రహింపబడలేదో అందువల్ల వేనిచే పొందబడక సన్నిహిత రూపవ్యజ్ఞానమగు రజతయథార్థపక్షముతోగూడ సారూప్యమున్నదో అట్టి గ్రహణస్మరణములె అయదార్థవ్యవహారమున కవి హేతువులు అని సిద్ధించి

నది. ఈ యథార్థ వ్యవహారము గ్రహణస్మరణలవలన గల్గినచో మరి 'వచ్చనిది శంఖము' ఇత్యాదులలో ఇక్కడ అవి లేకపోవుటవల్ల అవి సిద్ధింపవు అన్నచో అట్లనరాదు. సమీచీనసంసర్గ జ్ఞానము పొందిన సారూప్యత్వము కల్గినపుడు వివేకమును గ్రహింపని గ్రహణములకే వ్యవహారము కలుగ కలసి వచ్చును. కనుక కంటిగుడ్డునందుగల పిత్తద్రవ్యము నందలి పచ్చదనము పిత్తదోషవశము వలన ద్రవ్యము లేనట్లగును అనగా ద్రవ్యము గ్రహింపబడదు. ఆ ద్రవ్యమునందలి పీతరూపము కేవలము కన్పించును. కన్పింపబడు ఆ శంఖము కూడ శుక్లగుణము లేనిదై శ్వేతత్వము గ్రహింపబడక శ్వేతత్వరహిత శంఖము వలె స్వరూపముగా కనిపించును కనుక సంసర్గకు యోగ్యమైన ఈ గుణగుణుల సంసర్గమును గ్రహింపని సారూప్యముండుట వల్ల ట్లు వాస్తవికముగా వచ్చని బంగారపు ముద్ద జ్ఞానములో విలక్షణత్వము కుండుటవలన అనగా సామ్యముండుట వలన వ్యవహారము ఉపపన్నమగును. అట్లుకూడ చెప్పబడినది.

"పీతశంఖావబోధేహి పిత్తస్యేంద్రియవర్తినః
పీతిమాగృహ్యతే ద్రవ్యరహితో దోషతస్తదా"

చ్చని శంఖము అని బోధకలుగుటలో నేత్రేంద్రియమునందున్న పిత్తము యొక్క పచ్చదనము గ్రహింపబడుచున్నది. అట్టిదోషమును బట్టి పిత్త ద్రవ్యము గ్రహింపబడదు. దానియందు పచ్చదనము మాత్రమే గ్రహింపబడుచున్నది.

"శంఖస్యేంద్రియదోషేణ శుక్లిమా నసగృహ్యతే
కేవలం ద్రవ్యమాత్రంతు ప్రథతే రూపవర్జితమ్"

టికున్న పచ్చకామెర్ల రోగముచేత శంఖము యొక్క తెలుపు గ్రహింపబడదు. కేవలము రూపము లేని వస్తువు మాత్రమే తోచును.

"గుణే ద్రవ్యవ్యపేక్షే చ ద్రవ్యే చ గుణకాంక్షిణి
భాసమానే తయోర్బుద్ధిరసంబంధం న బుధ్యతే"

తనకు ఆశ్రయమైన ద్రవ్యాపేక్షగల గుణములను ఆకాంక్షించు ద్రవ్యము భాసించుచుండఁగా ఎక్కడ ద్రవ్యమును గుణమును రెండు భాసించునో వానిబుద్ధియును నిజమునకు వాని రెండింటికి సంబంధము లేకున్నను వానికి సంబంధము లేకపోవుటచే ఆయుభయవిధ బుద్ధియు గ్రహింపదు.

"సత్యపీతావభాసేన సమే భాతే మతీ ఇమే'
వ్యవహారోపితత్తుల్యఏవమత్రాపియుజ్యతే"

(ప్రకప 4-48-51) బంగారము మొదలైన వానియందు సత్యమైన పచ్చదనము భాసించుటచే ఈ రెండు బుద్ధులు సమముగా భాసించును. వ్యవహారము కూడ వానికి తుల్యమె. ఇట్లును ఇందుఁగూడ తగియున్నది.

ఓయీ — ఇది వెండియను భ్రాంతి జ్ఞానమును అంగీకరింపనపుడు రజతప్రసక్తియే లేకపోవుట వలన ఇదిరజతముకాదని నిషేధమెట్లు. రజతము యొక్క భావమును బోధించును గదా! అన్నచో ఇది దోషము కాదు. భేదమును గ్రహింపకపోవుటచే ప్రసక్తముగా చేయబడిన శుక్తిగత రజత వ్యవహారమును నిషేధించుటను స్వీకరించుటచేత కల్పనాలాఘవము ఉన్నది కనుక. అనగా ఇది రజత వ్యవహారయోగ్యము కాదు అను అభిప్రాయము చేత ఇది రజతముకాదని వ్యవహరింపబడు చున్నది. రజత నిషేధమును అంగీకరించినను తన్మూలకమైన రజతవ్యవహార నిషేధము ఉన్నదే. అందుచే ఉభయాభ్యుపేతమైన రజత వ్యవహారనిషేధమె. ఇది రజతము కాదను దానికి అర్థ లాఘవము కలుగుటవలన స్వీకరింపదగినది. ఇక్కడ ఇంక అతిరిక్తమైన రజత నిషేధ కల్పన ఏలయని భావము

"మిధ్యాభావోపితత్తుల్యవ్యవహారప్రవర్తనాత్'
రజత వ్యవహారాంశేసంవాదయతోనరాత్"

దానితో సమానమైనది అను వ్యవహారమును ప్రవర్తించుటవల్ల మిధ్యాత్వమును గలుగును. ఇది రజతము అను వ్యవహార కాలమున వివరించిన దానిని బట్టి స్ఫురణరూప భ్రమయే అగును.

"బాధకప్రత్యయస్యాపిబాధకత్వమతో మతమ్
ప్రసజ్యమానరజతవ్యవహారానవారణాత్"

భ్రమను బాధించు జ్ఞానమునకు గూడ అందువల్లనే బాధకత్వమును ఇష్టమె ఏలయన ప్రసక్తమైన రజత వ్యవహారము వారింపబడక పోవుట వలన బాధక జ్ఞానదశయందు ఇది రజతమను నంశ అనుసరించుచున్నది గాన. కనుక ప్రాచీన జ్ఞానములు సత్యమైనపుడు ఇంక భ్రమత్వము ఎట్లు సిద్ధించునను శంక దీనిచే నిరస్తమైనది.

సరికాని రీతిగా వ్యవహారము ప్రవర్తించుటచేత అది ఉపపన్నమగుచున్నది గాన. మరిఇది రజతము కాదని బాధించునట్లు చేయు బోధ అభావమును పొందదు. భావమునకు వ్యతిరేకముగా అభావము గ్రహించుట శక్యము కాకపోవుటవల్ల. సరే ఇట్లయినచో ఏమీ బాగుగలేదు అను నట్టి జ్ఞానమునకు ఏమి ఆధారము. ఆధారము లేకుండగనే జ్ఞానము కలుగునన్నచో మహా భావికుడను బౌద్ధుని పక్షమునంగీకరించినట్లే యగునన్నచో అట్లనకుము. భూతల మహాభావికుడు శూన్యవాది. సమస్త వ్యవహారములు ఆదారము లేకుండగనే గలుగునని అంగీకరించును. భూతలమందు ఘటము లేదు అను ఘటాభావ జ్ఞానము భూతలధర్మియైన ఘటమునకు ప్రతియోగి జ్ఞానమున్నపుడే అగును కనుక ఆ అభావమునకు స్వతంత్ర పదార్థత్వము కలదు అని అంగీకరించినను ధర్మిప్రతియోగుల జ్ఞానము ఆవశ్యకమె. కనుక ధర్మికల్పన కంటె ధర్మకల్పన వరమను న్యాయమును బట్టి అభావమనది అధికరణము యొక్క యొకానొక ధర్మవిశేషము వలన చెప్పబడు చున్నది. అదియును కేవల భూతలత్వరూపమైనది. దానిచేతనే ఘటము లేదను వ్యవహారము ఉపపన్నమగుచున్నది అని భావము. కేవల భూతల జ్ఞానమును ఘటాదియొక్క ప్రతియోగి కనిపించకపోవుటచే నగును. ప్రతియోగి యొక్క అదర్శనమును ప్రతియోగి స్మరణతోఁగూడియున్నదే అనునది ఇఁకొకటి అభావము ధర్మి ప్రతియోగి నిరూపణమునకు అధీనమైనదిగా నిరూపింపదగి యుండుటచేత తప్పక అంగీకరింపదగిన దృశ్య

ముసు ప్రతియోగియైన అదృశ్యమునుగాని స్మరింపబడుచుండగా అధికరణ మాత్ర బుద్ధికే లేదను వ్యవహారము ఉపపన్నమగుచుండగా అతిరిక్తా భావకల్ప నలో ప్రమాణము లేదు కనుక. అదియు అమృతకళ యందు చెప్పఁబడెను.

"అత్రోచ్యతేద్వయీసంవిత్ వస్తునో భూతలాదినః
ఏకా సంసృష్టవిషయా, తన్మాత్రవిషయాపరా"

ఇక్కడ భూతలాదియైన వస్తువుయొక్క జ్ఞానము రెండు విధములుగు చున్నది. ఒకటి-సంసృష్టవిషయము, ఉదా: భూతలము ఘటము కలది. రెండవది-, తద్విషయకము కాని భూతలమాత్ర జ్ఞానము.

"తన్మాత్రవిషయా వాపిద్వయీసాధనిగద్యతే'
ప్రతియోగిన్యదృశ్యేచ దృశ్యేచ ప్రతియోగిని"

తన్మాత్రవిషయమైనది కూడ రెండు విధములు. మరి అది చెప్పబడినది. ఘటాద్యదర్శనముతో గూడినది తద్దర్శనకాలికమును.

"తత్రతన్మాత్రధీర్యే యం స్మృతేచ ప్రతియోగిని'
నాస్తిత్వం సైవ భూభాగే ఘటాది ప్రతియోగినః"

(ప్ర.క.వ 6-37-39)

స్మరింపబడిన ప్రతియోగి యందు ఏ తన్మాత్ర బుద్ధి కలదో అదే భూభాగ మున ఘటాది ప్రతియోగికి నాస్తికత్వమె. ఎట్లన అందు మొదటిది ఘటాది స్మరణతో కూడినదై నప్పుడు పుట్టునో అప్పుడు తాదృశ భూతల స్వరూపమై అభావమె అని అర్ధము.

కనుకనే ప్రభాకర మతమును ననుసరించు శాలికనాథ మిశ్రులచే రచిత మైన ప్రకరణ సంచికలో ప్రమాణ పారాయణమును నైదవ ప్రకరణము నందు ప్రత్యక్షము మొదలైనవి అయిదే ప్రమాణములు విస్తరింపబడి నవి. అందు అవి ప్రత్యక్షానుమానోపమాన శబ్దార్థాపత్తులు అయిదు. అనుప

ట్టి అనుసారవ ప్రమాణము మీమాంసైక దీశులగు భాట్టులచేస్వీకరింప
డినను ప్రభాకరానుసారులచే స్వీకరింప బడకపోవుటచేఁజెప్పబడలేదు. అది
భావమునే కాని ఎప్పుడునుభావమును గ్రహింపదు. మరి భావము కంటె
ేరే అభావమను పదార్థమె లేనపుడు గ్రహించుటకింకొక ప్రమాణాపేక్ష
ందుకని భావము. ఇది రజతము ఇత్యాది జ్ఞానములు భ్రమాత్మకములు
ాన అవి యథార్థములా ఆయథార్థములా అనునవి వివాదగ్రస్తములు. కాన
ందిగ్ధసాధ్యత్వ రూప లక్షణము ఇచ్చుట అనుగతమైనదని భావము

ఈ విషయమును ఇతరులు సహింపరు. ............ ఇత్యాది వివాదా
ప్రద గూఢ విషయములు విస్తరభీతిచే ముగించ బడుచున్నవి.

"తత్త్వమసి అది నీవై యున్నావు. అని 'త్వం' నీవు అను పదార్థ
్రవణ మనన నాది జన్యసాక్షాత్కారముచే అవిద్యపోఁగా సచ్చిదానంద బ్రహ్మ
ర్భావము కలుగును గాన బ్రహ్మజిజ్ఞాస చేయువలసియున్నది. అను
ఈ విషయము మరి ఈ బ్రహ్మమీమాంసలో మొదటి సూత్రములో చెప్ప
డినది యుక్తము. ఇందు తెలియని బ్రహ్మవిషయము తెలియుట అనునది
పయోజనము. మోక్షేచ్ఛకలవాడు అధికారి. శక్తినిబట్టి శ్రుతినిబట్టి కలుగునది
ంబంధము. ఇంత రెండవ సూత్రములో బ్రహ్మము నిరూపితము. సకల
ునకు బ్రహ్మ కారణమని మూడవసూత్రములో నిరూపితము. వేదాంతము
న్నియు బ్రహ్మయందు తాత్పర్యమును చెప్పు చున్నవి. ఇట్లు ఇది దిఙ్మాత్ర
ుగా చెప్పబడెను. మిగిలినవి శాస్త్రమునందేస్పష్టము. ఇది అంతయు
మంజసము.

ఇది

ాయణమాధవాచార్యునిచే రచింపబడిన సర్వదర్శన సంగ్రహములో—
చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రిల తనయుడుమ షడ్దర్శనాది
బహు గ్రంథకర్తయునగు చర్ల గణపతిశాస్త్రిచే ననువ
దింపబడిన—దర్శనకర్తలు - దర్శనములు అను
గ్రంథములో—శాంకర దర్శనము.

సర్వము-సమాప్తము-

# అనుబంధము

ఇంతవరకు సాయణమాధవాచార్యులు రచించిన సర్వదర్శనసంగ్రహము లోని సర్వదర్శనములు వివరింపబడినవి.

ఇప్పుడింక నేటివరకు భారతీయములుగా లోకమున ప్రచారములోగల ఇతర మతములను వానిని స్థాపించి ప్రచారము చేసిన ఆధ్యాత్మిక వేత్తలను గూర్చియు వారియాశయములు మనోవైశద్యమునకై వివరింపబడుచున్నవి. ఇవి దేశ కాలములను బట్టి వచ్చినవి గాని సిద్ధాంతమును బట్టి వచ్చినవి గావు. అట్టి మతములు మొదట చూపబడినవి.

ఆయా సంప్రదాయములవారు వారి వారి భావాలను బట్టి కొన్ని సంప్రదాయములు ఏర్పరచిరి. అవి యికముందు చూపబడుచున్నవి

## 1. నింబార్కుడు — అతని సంప్రదాయము.

ఇతని మొదటిపేరు భాస్కరాచార్యుడు. ప్రసిద్ధ జ్యోతిష పండితుడు. ఇతడు నిజాము రాజ్యములో సింహాద్రి పర్వతము దగ్గర బేదర అను గ్రామములో క్రీ.శ 1036లో పుట్టెను. తండ్రి మహేశ్వరభట్టు బ్రాహ్మణుడు. ఇతడు తన తండ్రిదగ్గర గణితము ముహూర్త గ్రంథములు సిద్ధాంత గ్రంథము వేదములు శాస్త్రములు చదివెను. ఇతడు సిద్ధాంత శిరోమణి లీలావతి మొదలగు గ్రంథములు రచించెను.

మన దేశములో జైనమతము ప్రబలముగా నున్నపుడు ఆ జైన మతమును ఖండించి వైష్ణవసంప్రదాయమును ప్రచారము చేసెను. ఇతడు దేవాలయములలో రాధాకృష్ణుల విగ్రహాలను ప్రతిష్ఠచేసి వానిని పూజింప నుపదేశించెను.

ఇతడు పిదప సన్యాసమును స్వీకరించెను. బృందావనమున తఱచు ఉండెవాడు. దక్షిణోత్తర భారతదేశములో తన మతమును ప్రచారము చేసెను. వేదభాష్యమును రచించెనందురు. కాని అది లభ్యము కాలేదు. మధురలో రంగజేబు దానిని నష్టపఱచెనని ప్రచారము కలదు.

ఇతని అనుచరులు ఇతనిని సూర్యభగవానుని అవతారముగా మన్నించిరి. జైన బౌద్ధమతములను పోగొట్టుటకై అవతరించెనని అనుయాయులందురు. ఒకసారి జైనసన్యాసితో వాదవివాదములు చేయుచుండగా సూర్యుడస్తమించెనట. వాదము ముగించిన పిదప ఇతడు ఆ జైనసన్యాసిని భుజించి వెళ్లమనెనట. సూర్యాస్తమయములో పునేగాని నేను భుజింపనని అతడు చెప్పగా అతడు సూర్యుని అస్తమించకుండజేసెననియు అపుడు సూర్యుడు (అర్కుడు) తన దొడ్డిలో నిమ్మ (నింబ) చెట్టుపైని నిలిచెననియు అందుచే నింబార్కుడని అతనికి ప్రసిద్ధిగలిగెనని లోకులందురు. ఇతని అనుయాయులు గోపీచందనమును నిలువుబొట్టుగా ధరింతురు. విష్ణుభజనచేయుచు వీరి అనుయాయులు తులసి మాలలు ధరింతురు.

ఇతనికి కేశవభట్టు హరివ్యాసు అనుపేర్లుగల యిద్దరు శిష్యులు గలరు. వీరిని బట్టి ఈ సంప్రదాయము రెండు శాఖలుగనయ్యెను. ఇందులో ఒకరు విరక్తులుగను రెండవవారు గృహస్థులుగాను ఉండిరి. యమునా తీరాన మధుర దగ్గర ఇతని పీఠము గలదు. మధుర ప్రాంతములో ఇతని అనుయాయులు ఎక్కువమంది గలరు.

## 2. చైతన్యుడు—అతని సంప్రదాయము

చైతన్యుని తండ్రి జగన్నాధమిశ్రుడు. తల్లి పేరు శచి. జగన్నాధుడు శ్రీహట్టగ్రామమునందుండెను. తరువాత గంగాతీరమునందు కోరికతో నవద్వీపమునకు వెళ్లెను. 1407లో చైతన్యుడు పుట్టెను. చైతన్యుని నిమాయి అని కూడ అందురు. పండిత వాసుదేవ సార్వభౌముని దగ్గర చైతన్యుడు విద్యనభ్యసించెను. కొంత కాలమునకు వారు న్యాయశాస్త్రములో ప్రవీణులైరి. వాసుదేవభట్టు మిథిల నుండి వచ్చి నవద్వీపమునకు దగ్గరనున్న విద్యానగరములో ఒక విద్యాలయమును స్థాపించిరి. నవద్వీపము వంగదేశమున ప్రసిద్ధి పొందిన చోటు. మొదట నవద్వీపము వంగదేశపు రాజధానిగా నుండెను అది గొప్ప విద్యాకేంద్రము. అచ్చట చైతన్యుని

బాల్యము గడచెను. చైతన్యుని మొదటి భార్య లక్ష్మి. వివాహమైన కొలది దినములకే ఆమె చనిపోయెను. చైతన్యునికి ఇష్టము లేకపోయినను పిదప కొంతకాలమునకు విష్ణుప్రియ అను కన్యను వివాహమాడి ఆమెతో గార్హస్థ్య జీవితమును గడిపెను. తండ్రి చనిపోయెను. అన్న విశ్వరూపుడు సన్యసించెను. మాతపోషణ ఇతని నెత్తిపై పడెను. గృహస్థుడుగా ఉండి కూడ శ్రీకృష్ణుని ఉపాసనలో నిమగ్నుడయ్యెను. శ్రీరాముడను మిత్రునితో కూడి నియమముగ హరికీర్తన చేయుచుండువాడు. కొంత కాలమునకు ఇతడు విరాగియై 24 సం॥ల వయస్సులో సన్యసించి ధర్మ ప్రచారము చేసెను. ఆరేళ్లపాటు భారతదేశమున సంచరించి 18 ఏండ్లు పూరి జగన్నాథములో గడిపెను. చైతన్యుడు జనులకు ధర్మము బోధించుచు సదాచారియై యుండెను. ఎప్పుడును అతడు దుఃఖముచే పీడితులకు సేవ చేయుచు నుండెను. రోగులకు మందిచ్చి కష్టములో ఓదార్పు కూర్చుచు లోకులకు శాంతి కూర్చువాడు. ఇంద్రియ సుఖములనితడు త్యజించెను. దీనసేవయే అతని ధ్యాస. బాహ్యప్రపంచము మరచిపోవునంతగా హరినామ సంకీర్తనలో ఈశ్వరోపాసనలో మునిగిపోయి యుండెడివాడు. జీవితపు చివరివేళ అతడు చివరిసీమకు చేరుకొనెను. పిచ్చివానివలె పాటలు పాడుకొనుచుండెడి వాడు. ఇట్లుండ ఒక దినము ఆకాశమున నిర్మల చంద్రకిరణములు సముద్ర తరంగములపై పడుచు వెలుగుచుండెను. ఆ దృశ్యమును చూచి తన్మయుడైపోయెను. ఆ నీలిజలములలో శ్రీకృష్ణుడు జలక్రీడలాడుచుండెనను భావన అతని మనస్సులో ప్రవేశించెనో లేదో అంతలో ఆ అగాధ జలరాశిలో అతడు దూరికి పడెను. అదియే అతని అంతిమ ప్రయాణము. అతడు పరబ్రహ్మజ్యోతిలో లీనమయ్యెను. అతని అప్పటి వయస్సు 48 సంవత్సరములు. అతని గూర్చి అనంతసంహిత ఇట్లు చెప్పుచున్నది.

"ధర్మసంస్థాపనార్థాయ విహరిష్యామి తైరహమ్
నష్టభక్తిపథంకాలే, స్థాపయిష్యామ్యహంపునః

ధర్మసంస్థాపనకై భక్తులతో విహరింతును. కాలములో కలసిపోయిన భక్తిమార్గమును మరల స్థాపింతును.

"కృష్ణచైతన్య గౌరాంగ గౌరాంగచంద్రః శచీసుతః
ప్రభుర్గౌరహరిర్గౌరో నామాని భక్తిదాని మే

కృష్ణచైతన్య మొదలగు పేర్లు నాకు భక్తినిప్రసాదించునవి" అని

ఈ సంప్రదాయము వారికి శ్రీకృష్ణుడు ఆరాధించదగిన దేవుడు. "కృష్ణస్తుభగవాన్స్వయం" అన్నది వీరి మంత్రము. ఆ శ్రీకృష్ణుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపములు దాల్చి సృష్టి స్థితి లయములను చేయుచు ప్రజాపాలనకై భూమిపై పూర్ణావతారములును అంశావతారములును అనంత లీలలను దాల్చును. చైతన్య ప్రభువు వారి అవతారమని శిష్యుల నమ్మిక వీరు కర్మ జ్ఞాన వైరాగ్యాదుల కంటె భక్తియే సర్వశ్రేష్ఠమందురు. కుల మత భేదములు లేకుండ అందరకు దీక్ష ఇచ్చి శిష్యులుగా చేసికొనిరి. నేడు పూరి జగన్నాధములో పంక్తి భేదము లేకుండ భుజించుట చైతన్యుని సంప్రదాయము ప్రకారమె అందురు. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య మాధుర్యములు అని భక్తికి ఐదు భావములని వారి భావన. గోపికల భక్తి మధురభక్తి యందురు నామసంకీర్తనమె వారి ప్రధాన కర్మ.

హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం
కలౌనాస్త్యేవ నాస్త్యేవనాస్త్యేవగతిరన్యథా

హరి నామము కంటె వేరుగతి లేదని వారి భావన. ప్రేమకై ధ్యానము ఉపవాసము నృత్యము మొదలగు 64 సాధనములున్నవని యందురు. వీరికి గురుభావన మెండు.

యోమంత్రఃసగురుఃసాక్షాత్ యోగురుఃసహరిఃస్వయం
ప్రథమంతుగురుఃపూజ్యః తతశ్చైవ మమార్చనమ్

అని భజనామృతము చెప్పుచున్నది.

గురురేవసదారాధ్యఃశ్రేష్ఠమంత్రాదభేదతః
గురౌతుష్టేహరిస్తుష్టోనాన్యథాకల్పకోటిభిః
హరౌరుష్టేగురుస్త్రాతా గురౌరుష్టేనకశ్చన

మంత్రమె గురువు. సాక్షాత్తు గురువె హరి. ముందుగా గురువు పూజింప దగిన వాడు. పిదప నా (హరియొక్క) అర్చన. గురువే సదా ఆరాధింప

దగిన వాడు. మంత్రము కంటె అభేదముగా నున్నవాడు. గురువు సంతో షించిన హరి సంతోషించును. కల్ప కోటులలో నింకేదియు కాదు. హరి కోపించినచో గురువు రక్షించును. గురువే కోపించినచో రక్షించు వారు ఎవరును లేరు,అన్నది వీరి ఆశయము.

వీరి సంప్రదాయములో అవివాహితులు కూడనున్నారు. సాలో క్యము, సామీప్యము, సార్ష్టి, సారూప్యము అను నాలుగు విధముల ముక్తి పొంది పరమానందములో అఖండ సుఖభోగములు పొందుదురు. చైతన్య నిత్యానందుడేమియు వ్రాయలేదు. కాని వారి శిష్యులు సనాతనుడు, విదగ్ధ మాధవుడు అనువారు లలితమాధవము ఉజ్జ్వలనీలమణి మొదలగు గ్రంథ ములు రచించిరి. వీరు గోపీచందనముతో నిలువుబొట్టు ధరింతురు. వీరి శిష్యులు కొందరు చైతన్యుని తమ గురువుగా తలంతురు. గౌరాంగుడు కూడ ఈ సంప్రదాయమునకు చెందిన గొప్ప భక్తుడు.

## వల్లభాచార్యుడు – శుద్ధాద్వైతము

వైష్ణవమతమును గనుగొన్న వల్లభాచార్యుడు రాజస్థానమున గుజ రాతులో క్రీస్తు శక 1479లో చంపారణ్య ప్రాంతమున రాయపూరు సి.పి లో జన్మించెను. తండ్రి లక్ష్మణభట్టు. తల్లి అల్మగిర. ఇతడు తెలుగు బ్రాహ్మణుడు. అతడు చైతన్య మహాప్రభువుల సమకాలికుడు. దక్షిణ దేశ మున కాంకరవ గ్రామ నివాసి. నారాయణభట్టు అను విద్వాంసుని దరి విద్య నేర్చుకొనుటకై పంపబడెను.

ఇతడు తన 12వ ఏటనే వేదములు దర్శనములు పురాణములు అభ్య సించెను. ఇతని 1 వ ఏట తండ్రి మరణించెను. అతడు వారణాశి నుండి దామోదరదాసుడను శిష్యునితో బృందావనమునకు వెళ్లెను. పిదప అతడు తీర్థస్థానములన్నింటిని దర్శించెను. విద్యానగరము వెళ్లి అతడు శ్రీకృష్ణ దేవుని ఆస్థానమున ఉన్న స్మార్త పండితులను ఓడించెను. శ్రీకృష్ణదేవ

రాయలు ఇతనిని మెచ్చుకొని అనేక బహుమతుల నిచ్చెను. అక్కడ నుండి అతడు ఉజ్జయినికి వెళ్లెను.

అతడు వ్యాసుని జైమిని సూత్రములకు భాష్యమును రచించెను. సుభోధిని అను వ్యాఖ్యను భాగవతమునకు రచించెను. విష్ణునకు పుష్టినిచ్చు ప్రబల మర్యాద, సిద్ధాంతరహస్యము అను గ్రంథములను సంస్కృతభాషతో రచించెను. వ్రజభాషలో గూడ చాల గ్రంథముల రచించెను.

అతని శిష్యులు చాంపరాయనులో అతని జన్మస్థానములో ఒక దేవాలయమును నిర్మించిరి. అది ఇప్పటికిని గలదు. అతడు చివరరోజు కాశీలోనే గడపెను. అతని జీవితలక్ష్యము తీరినదని అతడు తలచెను. ఒక నాడు అతడు కాశీలో హనుమాను ఘాటుకి వెళ్లి స్నానము చేయుచుండ ఒక జ్వాల ఆకాశమునుండి భూమికి దిగినట్లు ప్రజలు చూచిరట. అది 1531లో అతని 52వ ఏట జరిగెను.

రామానుజునివలె మధ్వాచార్యుని వలెగాక ఇతడు అద్వైతమునకె పుష్టిని గూర్చెను. బ్రహ్మను సాకారముగా నంగీకరించెను అతని మతములో పరమాత్మ సాకారుడె. అతని మతములో బ్రహ్మ జీవాత్ముడని జడాత్ముడని రెండు విధములు. ఈ రెండింటి మిశ్రణవల్ల సృష్టి ఏర్పడునని యితని మతము. చైతన్యము జడములేక ప్రకృతి ఈరెండిటికంటె వేరుగా ఇంకేమియు లేదని యనెను. చైతన్యము జడము ఈ రెండింటి సమ్మేళనము అను మూడింటిద్వారా సంసారమున అనేక వస్తువులు ప్రత్యక్షముగుచు లోపించుచుండును. వస్తువులు ప్రత్యక్షముగుట అనగా పైకి కనిపించుట లోపించుట అనగా పైకి కనిపించక పోవుటే కాని వాస్తవికమునకు ఏదియు నశింపదు. బ్రహ్మండములోని పరమాణువులకు నాశమన్నది లేనేలేదు. నశించుట అను లోకవ్యవహారమునకు ఆ వస్తువులు వేరొక రూపమున నుండుట అనియె అర్థము

పరమాణువులు రూపాంతరము చెందుటవల్ల నశించుచున్నవని యనుకొనుచున్నారు, అవస్తువులు పరిణామము చెందుట అనువానినే వాని తిరోభావము ఆవిర్భావము అనుపేర్లతో వ్యవహరించుచున్నాము వల్లభాచార్యుల జ్ఞానమయ సిద్ధాంతములను తెలిసికొనవలయునన్న మనుష్యులు విషయ వాసనల నుండి ముక్తులు కావలయును, విషయ వాసనలలో మునిగితేలు మనుష్యులను తన ధర్మముతో దీక్షితులగుటకై విష్ణుస్వామి రామానుజులు మధ్వాచార్యులు నింబార్కులు మొదలగు ఆచార్యులు ప్రచారముచేసిన ధర్మముకంటే గొప్పది సరళము రసయుక్తము అధిక మనోరంజకము అగు సంప్రదాయమును ప్రచారము చేసెను. అతడు రాధాకృష్ణుల విహారములు ప్రేమపూర్ణభక్తి సందేశములు చెప్పి విషయవాసనా మగ్నులగు లోకులను తమమతములోనికి త్రిప్పుకొన యత్నించెను భగవత్ప్రసాదమన్నగా దుర్లభమైన పదార్థముకాదు. అతని యనుగ్రహమును పొందుటయేఅన్నెను.

మహాభారతములోని కృష్ణుడు భాగవతములోని కృష్ణుడును ఒకరే. భాగవతములోని శ్రీకృష్ణునికి విష్ణువునకును భేదములేదు. బ్రహ్మవైవర్తములో శ్రీకృష్ణునికి ప్రాధాన్యము గలదు. కృష్ణస్తు భగవాన్స్వయం అను భాగవత సూత్ర ప్రకారము ఈశ్వరత్వమును ఆరోపణ చేసి అతడు గుణాతీతుడని, మాయాతీతుఁడని నిత్యుడనంతుడని చెప్పెను. మాయాతీతుఁడుగాన శుద్ధాద్వైతబ్రహ్మమని శంకరుల మాయా వాదమును అతడు అంగీకరింపక శుద్ధాద్వైతముగా తనమతమును ప్రచారము చేసెను. అతడు నానాభూషితుడై పీతాంబర ధారియై మురళిదాల్చి గోలోకములో వైకుంఠములో ఏబదికోట్ల యోజనములపైని విరాజమానుడై యుండును. బ్రహ్మాది దేవులు మానవులు సకలసృష్టియు ఆ కృష్ణుని ఆ గోలోకములోని అంశవలన అయినవారై, పూర్వులు సన్యాసమును ఇష్టపడిరి. వారి దృష్టిలో వైరాగ్యస్థానములో సాకారోపాసనకు నివృత్తికి బదులు ప్రవృత్తియే కనిపించినది. పరమాత్ముని అన్వేషణలో ఉపవాసాదులుచేసి శరీరమును కష్టపెట్టుట వనవాసములు చేయుట తగదు, కాని ఈ జీవితములోని ఆనందము ననుభవించుచు బ్రహ్మభావ కృష్ణుని సాక్షాత్కారము పొందవలయునుఅనును.

అతనికి 84 గురు శిష్యులుండిరి. భారత దేశములో సంచరించిన స్థానములను బైటకములందురు. వానికి గుర్తుగా అచోట్ల మఠములు మందిరములు స్థాపింపబడెను అతనిభార్య లక్ష్మి బ్రాహ్మణకన్య. అతనికి గోపీనాధుడు విఠలనాధుడు అను ఇద్దరు కుమారులు గలరు వారుగోవర్ధన పర్వతముమీద శ్రీనాధమూర్తిని స్థాపించిరి. మహమ్మదీయుల భయముచే వారు 1576లో దానిని మేవాడునకు తీసికొని పోయిరి. అక్కడ నుండి 1587లో కాశీకి వెళ్లిపోయిరి. వల్లభాచార్యుడు తమ 52వ ఏట సద్గతిని పొందెనట.

వారు "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను ద్వాదశాక్షర మంత్రమును 'శ్రీకృష్ణః శరణంమమ' అను అష్టాక్షర మంత్రమును ఉపదేశించిరి. మత్ప్రసాదాత్తరిష్యసి అను గీతా వాక్యము వీరిమంత్రము. వారు మందిరములతో మంగళ హారతి, శృంగారము గోపాల రాజభోగము ఉత్థకము భాగయుగసంధ్య శయనము అనుపూజాపద్ధతుల నవలంబించిరి. వీరిభాగములు పవిత్రములని నిర్దుష్టములని యందురు. శ్రీకృష్ణ భగవానుని సాన్నిధ్యమును స్మరణను మోక్షముగా భావింతురు.

## వారిగ్రంథములు

1 భాగవతటీక 2 బ్రహ్మసూత్ర భాష్యము 3 సిద్ధాంతరహస్యము 4 భాగవత లీలారహస్యము 5 ఏకాంతరహస్యము 6 తంత్ర్వద్వీప నిబంధము 7 పుష్టిప్రవాహమర్యాద 8 నవరత్నములు మొదలగు గ్రంధములు రచించిరి.

వీరికి గీత, భాగవతము విష్ణుపురాణము ప్రమాణగ్రంథములు. రామలీలలు వీరు అనుకరింతురు. వీరు తమపుత్రులను గురువునకు సమర్పింతురు శ్రీకృష్ణలీలలు రాధాకృష్ణుల అరాధనలె వీరికి మోక్షము.

కబీరు జన్మమును గూర్చి సరిగా తెలియదు కొందరు బ్రాహ్మణుని కొడుకని కొందరు విధవకొడుకని కొందరుసాలెవాని కొడుకని అందురు. కాశిదగ్గర లహరి సరోవరము దగ్గర ఎవరో అపుడే పుట్టిన శిశువును వదలిపెట్టి వెళ్లిరని కబీరు మార్గస్థులు చెప్పుదురు. నూరి అనుసాలెవాడు అతనినితెచ్చి పెంచెనట నూరి సాలెవాని భార్య పేరు నీమ. ఆమె అతిప్రేమతో కన్నకొడుకును వలె పెంచినది. పిదప ఆ బాలుడు కబీరు అనుపేరుతో ప్రసిద్ధి పొందెను నిజముగ అతడు బ్రాహ్మణపుత్రుడై యుండెననుట నిశ్చయము. పెద్దవాడైన పిదప పెంపుడు తండ్రి పెండ్లిచేసెను. కబీరుకు కమాలఅను పేరుకల పుత్రుడు పుట్టెను. కబీరు విరాగి. మాయ మొదటి కూతురు సరస్వతి లక్ష్మి ఉమ అనువారు అతని అసలు కుమార్తెలు. వారిని బ్రహ్మ విష్ణు మహేశు లనువారితో పెండ్లిచేసెను.

కబీరుని పెంచినవాడు సాలెవాడు కనుక కబీరు నేతపని చేయుచుండెడివాడు. అతడు వెదకి స్వామి రామానందుడను గురువుదగ్గర రామనామ మంత్రమును గ్రహించి జపించెను. కాశిలో చాలాకాలము ఉండెను. రాముడే అతని దైవము, గురువు అన్నియు.

ఒకే ఈశ్వరుని కబీరునమ్మి అతడు సర్వవ్యాపి అని అఖండ జ్యోతీరూపుడనెను. అతనిని అల్లాఅనినను రాముడనినను ఒకటే రామ్‌రహీమ్ ఏక్‌హై అని ఆత్మజ్ఞానము ముక్తికి మార్గమని చెప్పెను, జపమాలాది బాహ్యవేషము లనవసర మనెను. మాలత్రిప్పుట మొదలగు వానితో పనిలేదని గట్టిగా బోధించెను. ఇతడు ఆనందసాగర, శబ్దావళి, బీజక [ఇది 760అధ్యాయములది] అనునవిముఖ్యములు. అతనికి హిందువులు మహమ్మదీయులును శిష్యులుండిరి. హిందూ మహమ్మదీయుల ఏకతకు పాటుపడెను. అతని చివర కాలములో శిష్యులతోపాటు గోరఖ్‌పూర్‌దగ్గర ఉన్న 'మగర' అనుగ్రామములో ఉండి శరీరమువదలెను.

మూర్తిపూజవ్యర్థమని అతడుచెప్పెను. సత్యజ్ఞానమువల్ల ఈశ్వరుని పొందవచ్చునని అతని నమ్మకము గోబ్రాహ్మణసేవ, మాంసమద్యాది వర్జనము, జీవహింసమానుట ముఖ్యకర్తవ్యములని బోధించెను.

అతనికి శ్రుతగోపాల, ధర్మదాసభాగూదాస, జీవనదాస, జ్ఞాని, సాహేబ దాసు, నిత్యానంద మొదలగువారు వారిశిష్యులు. కబీరుశిష్యులు ఒక మేళా జరిపిరి. దానికి 35000 మంది సాధువులు వచ్చిరట.

కబీరును గురించి ఒకకథ వాడుకలో నున్నది. ఒకసారి కబీరు ప్రచారము చేయుచు ఢిల్లీవచ్చెను, అపుడుఎవడోవెళ్లి సికిందరుతో కబీరు పాఖండి నాస్తికుడని లోకులను నాస్తికులను చేయుచున్నాడని చెప్పెను. అప్పుడు కబీరుని పట్టుకొని తీసికొని రమ్మని సికిందరు భటులను ఆజ్ఞాపించెను. అపుడు భటులు కబీరును దర్బారులోనికి తీసుకొనివచ్చిరి. వాళ్లు సికిందరుకు సలాము చేయమనిరి. కాని కబీరు సలాముచేయ నిరాకరించెను. అప్పుడు కబీరును చంపుడని సికిందరు ఆజ్ఞాపించెను. ఎన్నికష్టాలుపెట్టినను చనిపోలేదు ఒకసారి సికిందరు సింహాసనము కదలసాగెను. దానికి భయపడి సికిందరు కబీరును క్షమింప గోరెనట. కబీరు గోరఖపూరు దగ్గర మగర గ్రామములో శరీరమును విడచెనట.

## రాధాస్వామి సంప్రదాయము

రాధాస్వామి సంప్రదాయమును స్థాపించినవారు సామీజీ అనుపేరుతో ప్రసిద్ధి పొందిరి. వీరు 1818లో ఆగ్రాలోపుట్టిరి వారిది క్షత్రియజాతి వారి సమాధి స్వామీబాగు ఆగ్రాలోనున్నది. కబీరు ధారా అగమకీ సత్‌గురు దేహి లిఖాయ్, అనుసాఖియొక్క ఆధారముగా ఈ సంప్రదాయముస్థాపింప బడినట్లు చెప్పుదురు. ధారాశబ్దములో ధారా అను నక్షరములను తల్లక్రిందులు చేయగా రాధాఅని యయ్యెనని దానికి స్వామిపదము చేర్పగా రాధాస్వామి అని యయ్యెనని చెప్పుదురు. ఆధ్యాత్మధారా అన్నదీ రాధఅయ్యెనని స్వామి కలియుటతో రాధాస్వామి అని యయ్యెనని అధ్యాత్మఆదిధారా రాధాస్వామి అయి అది పరమాత్మ నామము అయ్యెనట. కాని రాధ అన్న పేరుతోను రాధాస్వామి కృష్ణుడు అన్న పేరుతోను వచ్చినదికాదు. ఈసంప్రదాయములో పరమేశ్వరుడు సర్వజ్ఞుడు ఆనందమయుడు. ఈసంప్రదాయజ్ఞులు సృష్టిని

1 దయాళుదేశము 2 బ్రహ్మాండదేశము 3 పిండదేశము అని మూడుగా వీరి గ్రంథములు విస్తరించి చెప్పినవి. యోగసాధనవల్ల రాధాస్వామి ధామము అనగా మోక్షమును పొందెదరట. దుష్టత్వము అధర్మము పెరిగి నపుడు పరమాత్మ అవతరించునని ఈ సంప్రదాయము వారందురు.

వీరి సంప్రదాయములో 1 రాధాస్వామి నామస్మరణ 2 రాధాస్వామి రూపధ్యానము 3 ఆత్మధారాశబ్దమును వినుట ఇదివారిమొదటి సాధన పద్ధతి రెండవ సాధనలో సంత్సంగము 2 గురువును సత్పురుషునిగా నమ్ముట వారి యుపదేశమును వినుట, మాలలు ధరించి అవిఅందరకు పంచుట వారి పదార్థ ములను గురుప్రసాదముగా పంచుట, గురువు వస్తువులను పవిత్రముగా తల గుట గురువుల పాదములకు నమస్కరించుట భజన ఈ సంగతులను రహస్య ముగా నుంచుట. ఇందు జాతి భేదములేదు. వినయము, క్షమాశాంతి ఇత్యా దులను మాదకద్రవ్య త్యాగము ముఖ్యములు. వీనిని గురువు ఉపదేశిం చును. వీరిని సంత్సంగులు అందురు సాధువులకి క్రింది నియమములు గలవు. 1 వ్యర్థముగా తిరుగకుండుట 2 ఎక్కడికైనను వెళ్లవలసి యున్నచో ంత్సంగుల ఆజ్ఞ గైకొనుట 3 ఎక్కడకైన వెళ్లవలసి యున్నచో ఆజ్ఞా తణ్రము తీసికొనివెళ్లుట 4 ధనము కూడ తీసికొని వెళ్లరాదు 5 ఎక్కడకైనను ంజనఖర్చు దారిఖర్చు తీసికొనవలెను సత్సంగము చేయుటకు వెళ్లినచో రోపకారము కొఱకు వెళ్లవలెను యువతీయువకులకు దూరముగా నుండ లెను. సాధువులకు భోజనము ఏర్పాటు చేయుట.

సౌరసంప్రదాయము

భారతదేశములో శైవము శాక్తము వైష్ణవము సౌరము గాణాపత్యము పసంప్రదాయము లుండెడివి, అందులో శైవశాక్త వైష్ణవములు నేటికిని చి యున్నవి కాని వాటిప్రభావము తగ్గిపోయినది.

సూర్యుని ప్రధాన దేవతగా గ్రహించిన వారు సౌరులు. వీరు మెడలో ు నుదుట రక్తచందనపు బొట్టుదాల్తురు. సూర్యగ్రహణమునాడు ఉప్పు

తినరు. సూర్యునిచూచికాని జలపానము చేయరు. వర్షాకాలములో సూర్యుని దర్శించిగాని భుజింపరు ఇప్పుడును సూర్యోపాసన చాలామంది చేయుదురు. గాయత్రీ మంత్రజపము సూర్యోపాసన చేయువారిదె. అదిత్యహృదయము సూర్యునిగురించినదె కోణార్కదేవాలయము దీనినే వ్యక్తపరుచుచున్నది.

## బ్రహ్మసమాజము

బ్రహ్మసమాజమును స్థాపించినవారు రాజారామమోహనరాయ్ గారు. వీరు బెంగాలులో రాధానగరులో పుట్టిరి. వీరితండ్రిపేరు రామకంతరాయ్ గారు. వీరు మహేశ అనువారిదగ్గర గణితము బెంగాలీ అరబీ ఫారసీ నేర్చుకొన్నారు. వీరు విగ్రహారాధనకు విరోధులు. ఏకేశ్వరారాధకులు పాట్నా కాశీలకు వెళ్లి సంస్కృతము చదివిరి. 16వ ఏటనే మూర్తిపూజా నిషేధము అను పుస్తకము వ్రాసిరి. ఇందువల్ల వీరుజాతినుండిబహిష్కృతులైరి. తండ్రి గారు కోపగించిరి. ఇంటినుండి వెడలగొట్టినను భయపడక దేశాటనచేసిరి టిబెటు వెళ్లిరి. తల్లిపట్టుదలచే వీరితండ్రి ఇంటికి రమ్మని వ్రాయగా వచ్చి ధర్మశాస్త్రములను, అంగ్లభాషను చదివిరి. వీరు సిరస్తాదారుగా పనిచేసి అ యుద్యోగము వదలివైచి ఉపనిషత్తులను అనువదించి బైబిలుచదివి ఒక సంప్రదాయమును ఏర్పరచిరి. ద్వారకనాథటాగూరు గారి సాయముతో 1818లో బ్రహ్మసమాజమున స్థాపించిరి. పరమాత్మ యొకడే అతడు నిరాకారుడు, జీవాత్మవేరు భక్తితో పరమాత్మను అరాధింప వలెను. మూర్తిపూజను జాతిభేదమును విడవవలెను, ధర్మము అచరింపవలెను అని బోధించెను.

1828లో సతీసహగమనమును మాన్పించిరి. 1831లో ఇంగ్లండువెళ్లి అక్కడ మృతిచెందిరి. కొంతకాలము దేవేంద్రనాథ టాగూరు బ్రహ్మసమాజము చూచుచు వచ్చిరి.

కేశవచంద్రసేను వీరిమతమును స్వీకరించిరి. వీరు 1862 లో ప్రౌఢా వివాహము వర్ణాంతర వివాహములను విధవా వివాహములను ప్రోత్సహించి

జరిపించిరి, దీనిని దేవేంద్రనాధ టాగూరుగారు సమ్మతింపలేదు. కేశవచంద్ర సేనుగారు తమ 13ఏండ్ల కుమార్తెను కూచబిహారురాజాకిచ్చి వివాహము చేసిరి. దానితో వీరిగౌరవమునకు దెబ్బతగిలినది. 1884లో వీరుమృతి చెందిరి వీరిబ్రహ్మసమాజము క్రమముగా చీలిపోయినది. ఇది ఆంధ్రదేశములో గూడ విస్తరించినది. పిదప ఇందులో భేదములు వచ్చుటచే ప్రార్థనాసమాజము అను నొకసంస్థ ఏర్పడినది.

## ఆర్యసమాజము

ఆర్యసమాజస్థాపకులు మహర్షిస్వామీ దయానందసరస్వతిగారు 1824లో వీరు కథియావాడు రాజ్యములో టంకారా గ్రామములో పుట్టిరి. వీరి మొదటి పేరు మూలశంకరులు తండ్రిపేరు అంబాశంకరులు వీరుఔదిచ్య బ్రాహ్మణులు 8వ ఏట ఉపనయన మైనది అప్పటినుండి వీరు సంస్కృతము అభ్యసించిరి. వీరు 18ఏట ఇల్లువిడచి సాధు సంతపురుషులతో గలసి పోయిరి. తండ్రి వెదకి తెచ్చిరి, కాని మరలపారిపోయిరి. వీరుబ్రహ్మచారులవలె వేదాధ్యయనము చేసిరి. పిదపవీరు గుజరాతులో ఒకసన్యాసుల సమ్మేళనము నకుపోయి అక్కడనే జ్వాలాపురి దగ్గర యోగాభ్యాసము నేర్చుకొనిరి. వీరికి 24వఏట పూర్ణానందస్వామి దీక్షయిచ్చిరి. దీక్షగ్రహించిన పిదప వీరుదయానంద సరస్వతిగా ప్రసిద్ధులైరి. పిదప సంచారము చేయుచు మధురచేరి విరజానందస్వామి దగ్గర వేదభాష్యములు న్యాయము నిరుక్తము షడ్దర్శనములు ఉపనిషత్తులు చదివిరి వీరు మూర్తిపూజను జాతిభేధమును బాల్య వివాహములను నిరోధించి ప్రచారము చేసిరి. 1711నుండి 1869 వరకు కాశీలో రాజాజయకృష్ణ సభాపతిత్వములో పండితులతో వాదవివాదములు జరిపి మూర్తిపూజ వేదవిరుద్ధమని స్థిరపరచిరి. గుణకర్మలనుబట్టి వర్ణవ్యవస్థను చేయవలెననిరి వర్ణాశ్రమధర్మమాచరింపవలెను నిత్యకర్మలు షోడశకర్మలు చేయువలెను. యజ్ఞాదులలో హింసపనికిరాదు పురాణములలో వేదవిరుద్ధ సంగతు లున్నవి. అవిప్రామాణికములు కావు కన్యావిక్రయము పాపము

యోగ్యశుద్ధిచేసి ఏజాతివానికైనను సంస్కారము చేయువలెను వీరు 1-3-1875 లో బొంబాయిలో ఆర్యసమాజ స్థాపన చేసిరి వీరు వేదములు కర్మపరములు కావు జ్ఞానపరములు అని చెప్పి వానికి జ్ఞానపరముగా ఈశ్వరపరముగా భాష్యము వ్రాసిరి. సంహితలుగాక బ్రాహ్మణములు వేదములు కావనిరి. సత్యార్థ ప్రకాశము అను గొప్పగ్రంథమువ్రాసి అందులో సర్వమతములను విమర్శించి వేదములు ప్రామాణికములని నిర్ధారణ చేసిరి. పరమత స్వీకారమును అడ్డగించిరి.

అరవింద యోగి స్వామిదయానంద సరస్వతి వేదభాష్యములను సమర్థించిరి. ప్రతిదినము పంచమహాయజ్ఞములను నిత్యకర్మలను సంస్కారవిధులను పూర్ణముగా ఆచరించువారిని ఆర్యసమాజములో చేర్చుకొనవలెననిరి. మద్యమాంసాదులు వర్జ్యమని చెప్పిరి. ఇది బొంబాయిలో ఆర్యమండలమను పేర ప్రసిద్ధమైనది. ఇది హైదాబాదులోను మరికొన్నిచోట్లను విస్తరించినది. 1979 విక్రమార్కసంవత్ లో దీపావళి నాడు స్వామిదయానంద సరస్వతి ఆర్యసమాజ భాసుడ మించెను.

ఇతర సంప్రదాయములు:-

రామకృష్ణపరమహంస, అరవిందఘోష్, వివేకానంద, రామతీర్థ, అనిబిసెంటు రమణమహర్షి జిడ్డుకృష్ణమూర్తి మొదలగువారు తమ తమ జీవితములను ఆధ్యాత్మికతత్త్వప్రచారమునకు అర్పించిరి.

శ్రీరామకృష్ణపరమహంస

ఇతడు కాళీభక్తుడు భక్తిఆవేశములో సమాధి పొందు చుండెడి వాడు ఎదుటిమనుష్యునివలె దేవుని చూచుచున్నానని ఈరామకృష్ణ పరమహంస వివేకానందునితో అనెను. అన్నిమతముల సాధనలను చేసెను.

శ్రీ అరవిందయోగి

ఇతడు పూర్ణయోగమును తెలిపెను సంవత్సరమున కొకసారి దర్శన మిచ్చి భక్తులను ఆశీర్వదించెను. మనుష్యుల వలె దేవతలను చూచుచు చూడవచ్చునని తెలిపెను.

శ్రీ స్వామీ వివేకానంద– రామకృష్ణ పరమహంస శిష్యుడు

ఇతడు ఆధ్యాత్మిక తత్త్వముతోపాటు దేశోన్నతిని ప్రబోధించెను. ఇతర దేశములో సంచరించి భారత దేశమునకు పేరుతెచ్చెను.

శ్రీ స్వామిరామతీర్థ

ఇతడు గుజరాత్‌లో 1874లో పుట్టి, ఏకాంతవాసియై తపస్సుచేసి విదేశాలలో ఉపన్యాసము లిచ్చెను. ఎన్నో గ్రంధములువ్రాసి సన్యాసియయ్యెను ఒకసారి గంగలోస్నానము చేయుచు జారిపడి దేహమును వదలెను.

శ్రీమతి అనిబిసెంటు

ఈమె అంగ్లదేశీయురాలు. గీత మొదలగువానికి వ్యాఖ్యలువ్రాసి దివ్య జీవన సంస్థను స్థాపించి హిందూ మతమును గొప్పగా తలచి ప్రచారము చేసెను.

శ్రీ జిడ్డుకృష్ణమూర్తి

ఇతడు తాను ఏ సంఘమునకు చెందక స్వతంత్రుడై స్వతంత్రాలోచనతో సత్యము గ్రహించి బోధచేసెను. ఏమతమును ఎవరిని ఎంతగొప్ప దాని నైనను గుడ్డిగా అనుసరించక స్వతంత్రముగా ఆలోచన చేసి విమర్శించి ధర్మాచరణచేసి సత్యజ్ఞానము పొంద తెలిపెను.

శ్రీ రమణమహర్షి

ఇతడు మౌనము ద్వారా దక్షిణామూర్తి వలె నిరాడంబరియై అందరి సందేహములను మౌనముతో సమాధాన పరచెను.

## ఉపసంహారము

మతకర్తలు, దర్శనకర్తలు, మహాత్ములు అనేకమార్గ జ్ఞానులు భక్తులు అనేకులు తాముద్వైతము విశిష్టాద్వైతము ఇత్యాది సిద్ధాంతములను తెలిసికొని వానిప్రకారము తమజీవితము కొని అచరించుచు ఇతరులకు బోధించుచు వచ్చిరి. నదులన్నియు ములో గలిసి నామరూపములను విడచి ఏకరూపమైనట్లు తాముఏకై పరమాత్మలో- తమఆత్మలను గలిపి లేక తాము పరమాత్మయు ని తెలిసికొని భిన్నత్వమును భ్రమనువీడి పరబ్రహ్మానందమును పొం మనము భిన్నులమను భ్రమనువీడి అన్ని భూతములు ఆ రూపమె అని తెలిసికొని బ్రహ్మవిదులమయి బ్రహ్మైక్యము ఆనందింతుము గాక.

ఇది

చర్ల గణపతిశాస్త్రి రచిత

సర్వదర్శన సంగ్రహము

సమాప్తము